పశువైద్య గ్రంథమాల 3 వ పుష్పము

# అంటువ్యాధులు

గ్రంథకర్త:

"అభినవ సహదేవ" ఆయుర్వేద పశువైద్యాచార్య, వైద్యకళా విభూషణ, పశువైద్యగ్రంథమాల, ఆయుర్వేద పశుచికిత్సాలయ సంస్థాపకులు, ఆంధ్ర జాతీయ పశువైద్య విద్యాపీఠ ప్రెసిడెంటు, ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలప్రిన్సిపాల్ వగు,

డాక్టర్ యేజెళ్ల శ్రీరాములు చౌదరి,

A. V. L. M. & S., A. M. B. & B.S.

అంగలూరు, కృష్ణాజిల్లా.



1937



[వెల రు 1-0-0.

# విజ్ఞప్తి

నేను సుమారు పదిసంవత్సరములకిందట ఆయుర్వేద పశుచికిత్సాలయమును ఆయుర్వేద పశువైద్య గ్రంథమాలను స్థాపించి అనుభవపూర్వకముగా నపుడపుడు పశువైద్య గ్రంథములఁ బ్రకటించుచు వార్తాపత్రికలలో వ్యాసములు వ్రాయుచు నా శక్తికొలది పశుసేవ చేయుచున్నసంగతి యాంధ్రులకును తెలిసియేయున్నది. నేను వ్రాసిన గ్రంథములనుబట్టియు, నా యొద్ద తరిబియతయిన వైద్యులద్వారాను, కరపత్రముల మూలకముగను ఆంధ్రదేశమందంతటను ఆయుర్వేద పశువైద్యమును వ్యాపింపజేసితిని.

మరియొక ముఖ్యవిషయమేమన నే నిప్పుడొక ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాలను స్థాపించి గవర్నమెంటువారిచే రిజిష్టరు చేయించి యనేకమంది పశువైద్యులను తరిబియతు చేయుచున్నాడను. ఈకళాశాల ప్రభుత్వమువారివలన త్వరలో రికగ్నైజు కానున్నది.

ప్రస్తుత కాలపరిస్థితులనుబట్టి రైతులకును విద్యార్థులకును తదితరులకును అర్థమగునటుల సులభశైలియందు ఇరువది పశువైద్య గ్రంథములను మాపశువైద్య గ్రంథమాలతరఫున బ్రకటించితిని. మా యాయుర్వేద పశువైద్య గ్రంథమాల యందు వెల్వడిన గ్రంథరాజములం దిదియు నొక్కటి. ఇయ్యది

పశుధనాభిమానులగు హైందవులకెల్లరకును హస్తభూషణమని చెప్పనగును.

మా యీగ్రంథములపై గవర్నమెంటు వెటర్నరీ, అగ్రికల్చరల్, రెవిన్యూ, ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులయందలి ప్రముఖులగు నుద్యోగులును తదితర డిపార్టుమెంటులవారును జమీందారులు భూస్వాములు మున్నగు వారు పెక్కురు పెక్కు సదభిప్రాయముల నొసంగియున్నారలు.

మా యీ గ్రంథముల నాంధ్రలోకమాదరించి ప్రతి పాఠశాలయందును, ప్రతిపుస్తక భాండాగారమందును, కోఆపరేటివు సొసైటీలయందును ఉంచి మాపశువైద్య గ్రంథమాల నభివృద్ధికి దెత్తురని విశ్వసించుచున్నారము.

ఈ గ్రంథమునకు దయతో పీఠిక వ్రాసి వన్నెదెచ్చిన పశుధనాభిమాన శిరోమణికిని ముద్దులొలుకునటు లీ గ్రంథమును త్వరలో ముద్రింపించి యిచ్చిన గ్రంథాలయప్రెస్సు మానేజరు శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని, నా యీ గ్రంథ రచనమునకు సాయపడిన గ్రంథముల రచయితలకును నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.



# అంటువ్యాధులు

## (Infectious Diseases)

పశువుల వ్యాధు లనేక విధములుగా నుండును. కొన్ని వ్యాధులు అవయవములు తమ తమ నియమిత వ్యాపారమును నెరవేర్చని కారణమున కలుగును. మరికొన్ని శీతోష్ణస్థితి భేదములవలన కలుగును. పెద్దరోగము, దొమ్మ, గురక, కూరమ మున్నగు రోగములు ఒక పశువునుండి మరియొక పశువునకు అంటుకొను రోగములు. ఇవి కంటికి కగుపడని సూక్ష్మజీవుల వలన కలుగుచున్నవి. వృక్షములలో ఒక్కొక్క చెట్టునకు ఒక్కొక్క జాతి బీజముండును. ఆబీజము ఏప్రదేశమున బడిన నా ప్రదేశమునందు మొలకెత్తి దానినుండి అవృక్షమే మొలచును. అటులనే అంటువ్యాధులకును ఒక్కొక్క వ్యాధి వ్యాపింపజేయుటకు సూక్ష్మజీవులు (Micro-organisms) బీజములగుచున్నవి. ఒక జంతువునుండి వేరొక జంతువునకు వ్యాప్తమగువ్యాధి అంటువ్యాధి యనబడును. ఒకటే విధమగు లక్షణములు కలిగిన రోగము ఒకటేవిధమగు సూక్ష్మజీవివలన కలుగుచున్నట్లు దృఢపడినది. పెద్దరోగపు విత్తనము నాటిన శరీరమున పెద్దరోగపు లక్షణములే కనబడునుగాని గురక లక్షణములు కనబడవు. ఒక పశువునుండి మరియొక పశువునకు అంటు

వ్యాధి వ్యాపించవలె ననినచో ఈ క్రింది పరిస్థితు లనుకూల పడవలెను.

1 వ్యాధిని కలుగచేయుటకు తగిన తీవ్రతగల సూక్ష్మ జీవుల సమూహము.

2 వ్యాధిని కలిగించుటకు చాలినన్ని సూక్ష్మజీవులను ఒక ప్రదేశమునుండి మరొక ప్రదేశమునకు గొని పోగల సాధనము.

3 సూక్ష్మజీవులు సులభముగ ప్రవేశించుటకు అనుకూలమైన శరీరక్షేత్రము.

పై పరిస్థితు లెంతపూర్తిగా అనుకూలపడిన అంత త్వరలో తగినంత తీవ్రతతో వ్యాధి ఒక పశువు నుండి మరియొక పశువునకు వ్యాపింపగలదు.

## -♦ అంటువ్యాధుల వ్యాపకము ♦-

ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు అంటువ్యాధులు వ్యాపించుటకు ఆ ప్రాంతములందు కలుగు మనుష్య సంచారము, జంతుసంచారమును కారణములు. పశువులు మేత కొరకు దూర దేశములకుపోవుట, చచ్చినజంతువుల మాంసమును మాదిగవాండ్రు వేరొక ప్రదేశమునకు తీసికొనిపోవుట, కాకులు, కుక్కలు అంటుజాడ్యముగల జంతువుమాంసమును ఎత్తుకొని అక్కడక్కడ పారవేయుట, అంటువ్యాధులుగల పశువులను సంతలకు తీసికొనిపోవుట, చచ్చినపశువులను

పాతిపెట్టక నదులలో పారవేయుట మున్నగు కారణములవలన అంటువ్యాధులు వ్యాపించుచుండును.

-♦ సూక్ష్మజీవులజాతులు ♦-

సూక్ష్మజీవులలో కొన్నిరకములు వాయుపరిసారము గల స్థలమునందే జీవింపగలవు. కొన్ని గాలిలేని స్థలములందే జీవించును. కొన్ని ప్రాణములుగల భాగములనే తిని బ్రతుకును. కొన్ని కుళ్ళిననిర్జీవ పదార్థములనే తినును.

చీమునుకలిగించు సూక్ష్మజీవులు
క్షయనుకలిగించు సూక్ష్మజీవులు
దొమ్మనుకలిగించు సూక్ష్మజీవులు
పెద్దరోగమునుకలిగించు సూక్ష్మజీవులు
ధనుర్వాతమునుకలిగించు సూక్ష్మజీవులు

ఇవి తమ కనుకూలమగు పరిస్థితులు కలుగువరకును సదానిద్రావస్థలోనుండి, పరిస్థితు లనుకూలించినవెంటనే విజృంభించి రోగమును వ్యాపింపజేయును. సూక్ష్మజీవి సామాన్యమగు కంటికి కనబడక పెక్కురెట్లు పెద్దదిగ గోచరింపజేయు సూక్ష్మదర్శినిలేక భూతదర్పణము (Microscope) సహాయమున మాత్రమే కనబడును. వీని శరీరపరిమాణము అంగుళములో 1/5570 - 1/450 భాగము మాత్ర ముండును. ఇవి వాతావరణమునందును, నీటియందును, ఆహారపదార్థములందును, నేలపై పొరలలోనుండు మట్టియందును జీవించుచుండును. పశువు శరీరముపైనను, జీర్ణకోశమందును కూడ సూక్ష్మజీవు లుండును.

ఒక్కొక్కజాతి సూక్ష్మజీవికి ఒక్కొక్కగుణము కలదు. కొన్ని దుర్వాయువులను కలిగించును. కొన్ని దుర్వాయువులను కుళ్లినట్లుచేయును. కొన్ని కుళ్ళినపదార్థములను తిని వానిని శుభ్రపరచును. కొన్ని శరీరమునందు వ్యాపించుచు రోగమును కలిగించును. కొన్ని తాము కదలకుండ తమ విషమును శరీరమున వ్యాపించుటకు విడుచును. మరికొన్ని పాలు పెరుగు సారాయి మొదలగునవి పులియజేయును.

## సూక్ష్మజీవులు శరీరమున ప్రవేశించుట.

శరీర చర్మము పైభాగమున నున్నంతవరకు సూక్ష్మజీవులు ఎట్టిహానిని కలిగింపజాలవు. ఏదోయొరీతిగా అవి శరీరము లోపల ప్రవేశించినప్పుడే రోగమును కలుగజేయును. సూక్ష్మజీవులు శరీరమున ప్రవేశించుటకు ఈ దిగువ మార్గములు గలవు.

గాయములద్వారా నోటిద్వారా శ్వాసకోశములద్వారా శరీరమందలి పలుచని పొరలద్వారా

కొన్ని సూక్ష్మజీవులు వీనిలో నేదోయొక మార్గమునే యెంచుకొనును. మరికొన్ని రెండు మూడు మార్గముల ప్రవేశించును.

-• గాయములద్వారా ప్రవేశించుట •-

పిచ్చికుక్క కరచుటచేతను గలుగు వ్యాధికి కారణమగు సూక్ష్మజీవి గాయముద్వారా ప్రవేశించును. దొమ్మరోగములను గురకరోగమును కలిగించు సూక్ష్మజీవియును

గాయముద్వారా ప్రవేశించును. ధనుర్వాతమును కలిగించు సూక్ష్మజీవియును గాయముద్వారా ప్రవేసించును. ధనుర్వాతమును కలిగించు సూక్ష్మజీవియు కురుపులలో చీముపుట్టించు సూక్ష్మజీవియు నిట్లే ప్రవేశించును. కురమను కలిగించు సూక్ష్మజీవి దోమలవలన ప్రవేశించును.

—♦ శ్వాసకోశములద్వారా ప్రవేశించుట ♦—

సూక్ష్మజీవులు ఊపిరితోపాటు శ్వాసకోశములలో ప్రవేశించి వానియందలి పలుచని పొరలలో నివాసమేర్పరచుకొని రోగమును కలిగించును. గాలివలన వ్యాపించు మశూచి విషజ్వరము మున్నగువ్యాధులు వానికి కారణములగు సూక్ష్మజీవులను ఊపిరిచే పీల్చుటవలననే కలుగును.

—♦ పలుచని పొరలద్వారా ప్రవేశించుట ♦—

పశువు నోటిలోపలను పుర్మావయవములందును ఆసనద్వారమందునుగల మృదువైన పలుచని పొరలుద్వారా గాయములేకున్నను సూక్ష్మజీవులు లోనికి ప్రవేశించి రోగములను కలిగించును. కంటిలోని పలుచని పొరలలో సూక్ష్మజీవులు చేరుటవలన కండ్లకలకయు, ముక్కురంధ్రములందు సూక్ష్మజీవులు ప్రవేశమువలన పీనసరోగమును కలుగును.

—♦ నోటిద్వారా ప్రవేశించుట ♦—

ఆహారపానీయములతో సూక్ష్మజీవులు నోటిద్వారా జీర్ణకోశమున ప్రవేశించి వ్యాధులను కలిగించును. వీనిలో

పెద్దరోగము, పారుడు, రక్తవిరేచనములకు, సూక్ష్మజీవుల సంపర్క మనేకవిధముల కలుగవచ్చును. పెద్దరోగముచే బాధపడిన పశువు మలమూత్రములలో తత్కారణములగు సూక్ష్మజీవులు రోగము విడిచిన కొంతకాలమువరకును విసర్జింపబడు చుండును. వీనిచే జలాధారములు సంకరము కావచ్చును. మలమూత్రములపై వ్రాలిన ఈగలు దోమలు సూక్ష్మ జీవులను తోడ్కొనివచ్చి జావ, గుగ్గిళ్ళు పచ్చిగడ్డి మున్నగు ఆహార పదార్థములందును చేర్చును. క్షయవ్యాధి గల ఆవుల పాల ద్వారా ఆవ్యాధి సూక్ష్మజీవులు పాలనాహారముగా గొనుచున్న పిల్లల శరీరమున ప్రవేశించి క్షయవ్యాధిని కలిగించును.

## సూక్ష్మజీవులు శరీరమును విడుచుట

ఒక పశువు శరీరములో ప్రవేసించి వ్యాధిని కలిగించు సూక్ష్మజీవులు తిరిగి శరీరమున నుండి వెలువడిన గాని ఇతర పశువుల శరీరములకు వ్యాపింప జాలవు. సూక్ష్మజీవులు శరీరమును విడుచు మార్గములు:—

1 నోరు, కండ్లు, ముక్కు, ఊపిరితిత్తులు వీనినుండి వెలువడు ద్రవములద్వారా. 2 విరేచనములద్వారా. 3 మూత్రముద్వారా. 4 కురుపుల రసిద్వారా.

మశూచికము, పెద్దరోగము వచ్చునపుడు శరీరమునందు కుండలు పొక్కులు పలుచబడి, ఎండి, పొక్కులై వాని నుండి వెలువడు పొప్పర్లు గాలిలో ఎగురును. ఈ పొప్పర్లలో నసంఖ్యాకములుగ సూక్ష్మజీవులుండును. దొమ్మ, గురక సోకి

నపుడు వెడలు కఫముతో సూక్ష్మజీవులు వెడలి గాలిలో జేరును. క్షయపశువుల చొంగ కఫము ఎండి గాలిలో దుమ్ముతో కలసి ఎగురునప్పుడు దానిలో ననేక సూక్ష్మజీవు లుండును.

ఏరీతిగానైనను రోగపశువుల శరీరమునుండి బహిర్గతము లగు సూక్ష్మజీవులు తిరిగి ఆరోగ్యవంతములగు పశువుల శరీరములందు వెంటనే ప్రవేశించవచ్చును. లేదా కొంతకాల మట్లేయుండి బయట జీవించుచుండవచ్చును. అనుకూల పరిస్థితులలో సూక్ష్మజీవులు నిరంతరము వృద్ధిజెందుట కవకాశములు గలిగియున్నవి. పశువు మరణించినపుడు తగిన యాహారములేక సూక్ష్మజీవులు నశించును. రోగము కుదిరినప్పుడును సూక్ష్మజీవుల బలముతగ్గి చాలవరకు నశించును. కొన్ని సూక్ష్మజీవులు పరిస్థితు లనుకూలముగా లేనప్పుడు గుడ్లుగా మారి పరిస్థితు లనుకూలపడువరకు నట్లేయుండును.

---

## సూక్ష్మజీవుల కననుకూలమగు స్థితిగతులు

### వేడిమి (Heat)

శీతోష్ణముల ఆధిక్యము సూక్ష్మజీవుల జీవనమున కననుకూలముకాదు. కొంచెము వెచ్చదనము సూక్ష్మజీవుల వృద్ధి కావశ్యకము. ఎంతవేడిమి వానికనుకూలమో అంతటి శరీరోష్ణముగల జంతువులందే అవి వృద్ధిచెందును. దొమ్మసూక్ష్మజీవుల గుడ్లు సీలుజేసిన గొట్టములలో 22 సంవత్సరములు

బ్రతికియుండెనని పాస్టర్ (Pasteur) అను శాస్త్రజ్ఞునిచే కని పెట్టబడెను. కొన్ని జాతుల సూక్ష్మజీవులు మరికొన్ని జాతుల సూక్ష్మజీవులతో కలసినప్పుడు నశించును. సూక్ష్మజీవులగుడ్లు 130 డిగ్రీలవరకు ఉష్ణముగల వేడినీటిని సహించి జీవింపగలవని రుజువు పడినది. నీరుచల్లారిన పిదప గుడ్లు తమకవచము లను చీల్చుకొని సూక్ష్మజీవులుగా విజృంభించును. కావున సూక్ష్మజీవుల నశింపజేయు నుద్దేశముతో నీటిని మరుగబెట్టునపుడు అరగంటవరకైనను మరగించవలెను. గోరువెచ్చగా నీటిని కాచుటవలన ప్రయోజనము లేకపోగా వాని కనుకూలమగు ఉష్ణమును కలిగించి అవి వృద్ధిజెందుటకు సహాయపడుచున్నాము.

## చెమ్మ (Humidity)

ఏమాత్రమును చెమ్మలేక మిక్కిలి పొడిగానుండు పదార్థములందు సూక్ష్మజీవులు వర్ధిల్లజాలవు. సూక్ష్మజీవులు తమ చుట్టునున్న పొరలద్వారా ఆహారమును ద్రవరూపమును పీల్చును. కాబట్టి సూక్ష్మజీవులు అభివృద్ధికి వేడిమివలెనే కొంత చెమ్మయు నావశ్యకము.

## వెలుతురు (Light)

సాధారణముగా సూక్ష్మజీవులు అన్నియు చీకటిలో బాగుగా పెరుగగలవు. కొన్నిటికి కొంత వెలుతురు ఆవశ్యకము. కాంతిగల వెలుతురులో ఏజాతి సూక్ష్మజీవియు బ్రతుకజాలదు.

## ప్రాణవాయువు (Oxygen)

కొన్ని సూక్ష్మజీవులు ప్రాణవాయువులేని దే బ్రతుక జాలవు. మరికొన్నిటికి ప్రాణవాయువు అపాయకరము - పై విష యములనుబట్టి అనుకూలపరిస్థితు లేర్పడినంతకాలము సూక్ష్మ జీవులు నీటియందును, భూమియందును, గాలియందును, జీవించి యుండగల వని స్పష్ట మగుచున్నది. సూక్ష్మజీవులగుడ్లు మాత్రము పరిస్థితులు ప్రతికూలించినను ఎండవానలను, శీతో ష్ణములను లెక్క చేయక బ్రతికియుండి అనుకూల స్థితిగతు లేర్పడినవెంటనే సూక్ష్మజీవులుగామారి విజృంభించును. తొలక రించిన వెంటనే దోమ్మలు, గురకలు వ్యాపించుట కిదియే కారణము.

## అంతర్గతకాలము (Incubation Period)

ఏదైన బీజము నాటినప్పుడు అది వృద్ధిపొంది మొలక యగుటకు కొంతకాలము పట్టును. బీజమున కాహారపోషణ బాగున్నచో అది బ్రతుకును. ఆహారసమృద్ధిలేని బీజము నశిం చును. సూక్ష్మజీవులు రోగపశువుల శరీరములనుండి ఏయే విధ ముల బహిర్గతములగునో, ఏయేస్థితిగతులలో అవి జీవింప గలవో, ఏవిధముగ నవి శరీరములో ప్రవేశించునో పైన తెలుపబడినది. వృక్ష బీజములవలెనే సూక్ష్మజీవులును శరీర ములో ప్రవేశించినంత కాలము వరకును శరీరములో పెరిగినపిద

పనే రోగలక్షణములు కనబడును. సూక్ష్మజీవుల ప్రవేశ సమయము మొదలుకొని రోగలక్షణములు కనబడువరకును గల మధ్యకాలమునకు అంతర్గతకాల మనిపేరు. అంతర్గత కాలము కొంచెము హెచ్చుతగ్గులతో ఒక్కొక్క సూక్ష్మజీవి కొక విధముగ నియమితమై యున్నది. ఈకాలమునందు శరీరమున ప్రవేశించు సూక్ష్మజీవుల సంఖ్య ననుసరించియు, రోగమును నిరోధించుటకు శరీరము నందుగల పటుత్వము ననుసరించియును స్వల్పమగు వ్యత్యాసములు కలుగుచుండును. దుర్బల శరీరము సూక్ష్మజీవుల కనుకూలమగు క్షేత్రము. ఎక్కువ సంఖ్యగల సూక్ష్మజీవులు దుర్బలమగు శరీరమున ప్రవేశించునవుడు త్వరలో రోగలక్షణములు కనబడును. బలమైన శరీరమున స్వల్పసంఖ్యగలసూక్ష్మజీవులు ప్రవేశించినచో రోగము గలిగించుటకు వలయు శక్తిగలిగి యుండవు. ఈ ప్రక్కనున్న పట్టీలో అంతర్గత కాలమును, వ్యాధికుదిరిన తరువాత అంటుతనము పూర్తిగా పోవువరకు రోగ పశువు నితర పశువులతో కలియకుండ బహిష్కరించ వలసిన కాలపరిమితియు తెలుపబడినవి.

## అంటువ్యాధు లెంతకాలముండునది తెలియజేయు పట్టిక.

| వ్యాధి పేరు. | అంతర్గత కాలము. | వ్యాధి నిర్ధారణయగు దినము. | పశువును బహిష్కరింపవలసిన కాలము. |
| --- | --- | --- | --- |
| పెద్దరోగము | 2 దినములనుంచి 8, 12 దినములవరకు | జ్వరము వచ్చిన తరువాత మేత మేయకుండుట | పారుడు సాంతముగా కట్టిన వారము దినములవరకు |
| దొమ్మ | 2 నుంచి 3 దినములు | నోటివెంట చొంగపడుట | పశువు మేత తినువరకు |
| గురక | 24 గంటలు | గురకపెట్టుట | సామాన్యముగా చికిత్సకు లొంగదు |
| కురచ | 2 నుంచి 5 దినములు | అతితీవ్రమైన జ్వరముకలిగి కాళ్లు పట్టుపట్టుట | పశువు మేత తినువరకు |
| గాలికుంటు | 24 గం. నుండి 7 దినముల వరకు | తీవ్రమైన జ్వరము, పుండ్లు పడుట | పుండ్లుమాని మేతపట్టు వరకు |
| క్షయ | 10 దినములనుండి కొన్ని వారములవరకు | దగ్గు కల్గిపడును | దగ్గు కట్టువరకు |
| మశూచి | 3 నుండి 5 దినములవరకు | తీవ్రమైన జ్వరము, రసి కుండలుపోయుట | పొక్కులన్నియు ఊడిపోయిన తరువాత ఒక వారమువరకు |
| కల్లవాపు | 3 నుండి 18 దినములవరకు | వాపులు వాచును | వాపులుతగ్గి మేత మేయువరకు |

## రక్తసంబంధమగు వ్యాధులు

—♦ పెద్దరోగము (Rinderpest) ♦—

దీనిని పంజాబులో మాతయనియు, బంగాళములో గూటిఛీచుగీకఁనియు,సంయుక్త రాష్ట్రములలో మనువాన్ యనియు బొంబాయి రాష్ట్రములో "ఫే" యనియు, ఆంగ్లేయమున రెండర్ ఫెస్టు యనియు, చెప్పుదురు. ఈవ్యాధినే మన రైతులు పారుడు రోగము లేక నల్లముసురు, చీడపార్లు, సరకు అనియు, మరికొందరు గొట్టాలమ్మ అమ్మవారు, విషజ్వర మనియు చెప్పుదురు.

—♦ స్వభావము - వ్యాపకము (Distribution) ♦—

మానవ జాతికి కలరా ఎటువంటిదో పశుజాతికి ఈపెద్ద రోగ మటువంటిది. పశువులకు సంభవించు వ్యాధులన్నిటిలో నిది ప్రమాదకరమైనది. మన హిందూ దేశములో నీవ్యాధి అనేక సంవత్సరములనుండి వ్యాపించియున్నప్పటికి దీనికి సరియైన చికిత్స లభించుచుండుటలేదు. ఈవ్యాధికి ప్రధాన స్థానము మన హిందూ దేశమై యున్నది. ఇచ్చట అన్ని కాలములయందును రోగరాజము యథేచ్ఛగా రాజ్యము చేయుచుండును. ఈవ్యాధి నెమరువేయు జంతువులకే తరచుగా వచ్చుచుండును. ఇంకను కుక్కలకు పందులకు సోకును.

—♦ అమ్మవార్లను కొలుచుట - ముడుపులుకట్టుట ♦—

ఈవ్యాధి మనదేశములయం దన్ని ప్రాంతముల యందును వ్యాపించి అనేక మంది రైతులను దుఃఖాంబుధిలో ముంచుచున్నది. నేను 1928 వ సం॥ము నుంచి నేటివరకు ప్రత్యే

కముగా నీవ్యాధినిగూర్చి అన్నిజిల్లాలలోను ప్రచారముగావించి యుంటిని. ఒక్కొక్క గ్రామములో వేలకు వేలు పశువులు మరణించినవని తెలుపుటకు విచార పడుచున్నాను. నేను ప్రచారముచేసిన గ్రామాదులలో నున్న పశువుల కొమ్ముల కన్నిటికి ముడుపుగుడ్డలు కట్టిరి. ఆగుడ్డ పసుపుగుడ్డ. దానిలో ఒక రూపాయికలదు. ఇంకను ఆగ్రామ పొలిమేర సరిహద్దులలో పసుపుకుంకుమచే పూజచేసిన స్తంభములు పాతిపెట్ట బడి యున్నవి. ఒక్కొక్క గ్రామమువారు 100, 200 రూపాయ లిచ్చి భూతవైద్యులచే బాగుచేయించెడివారు. కొందరు రైతులు రక్షరేకులు కట్టించి శకునముల నడుగుచుండెడివారు. ఇంకకొన్ని గ్రామములలో ఘటపుకుండ యూరేగింపులు, ప్రభలు రథములమీద బండ్లమీద గట్టి యూరేగింపులు జరిగెడివి. వేపాకు తోరణములు ప్రతి బజారులోను కట్టి అమ్మ వారిని కొలుచుచుందురు. సారాయి కల్లు త్రాగి అమ్మాయి కావలెను, అబ్బాయి కావలెను, దున్నపోతు కావలెను, మేక పోతుకావలెనని పూనునట్లు నటించుదురు వారికి సాంబ్రాణి ధూపమువేసి కొబ్బరికాయలు కొట్టుదురు. మరికొందరు గణాచారులు రహస్యముగా గుసగుసలాడి కత్తికేకలు వేయుచు చిందులు త్రొక్కుచుండ తదితరు లెంతమంది పట్టుకొనినను ఆగకుందురు.

—♦ డాక్టరుగారినిగూడ నిరాకరించుట ♦—

గ్రామములోనికి పశువుల డాక్టరుగారు రాగానే కొంత మంది మూఢత్వపు రైతులు ఏమండీ డాక్టరుగారూ! ఈపెద్ద రోగము అమ్మోరుపైన నాధారపడి యున్నదిగాని మీవల్ల

గాదని చెప్పుదురు. ఇంకను డాక్టరు చెప్పినపనులు చేయక ముడుపులు కట్టి అమ్మవారిమీదనే ఆధారపడి యుందురు. తరువాత కర్మవశముచే ఆపశువు బ్రతికిన మొదలు తదితరులు గూడ ఆవిధముగనే అమ్మవారికి మ్రొక్కుకొని జాతరులు చేయుట మొదలగు పనులు చేయుచుందురు.

—♦ మరియొక చిత్రము ♦—

ఇంకొక చిత్రమైన పనికూడ గలదు. కొన్ని గ్రామాదులలో ఆవ్యాధి సంభవించినప్పుడు తన యజమాని తన పశువులను గ్రామమునకు దూరముగానుండు పొలములోనుంచి తన నౌకరు నొకని నక్కడ కావలియుంచును. ఆకాపరి గ్రామములో నెమ్మదించువరకు తన బట్టలను విడువడట - ప్రతి ఆదివారము గురువారము ఉదయ భోజనమునకై వండిన వేడి యన్నమును ఎవరును ఎంగిలి చేయకుండ అర్ధరాత్రివేళ తీసికొనివెళ్ళి ఆకాపరి జబ్బుగానున్న పశువులమీద జల్లునట - మాంసాదులు పిండివంటలు తినరట - ఆపశువు రోగము నెమ్మదించువరకు ఆనౌకరు క్షౌరము చేయించుకొనగూడదట - ఎన్నిమాసములైనను తన బట్టల నుతకడట - ఈరీతిగా మన దేశములో అక్కడక్కడ మూఢరైతులున్నారని తెలిసినందులకు విచారకరము. రైతులు పశువుల విషయములో తగు జాగ్రత్త వహించక వ్యాధిముదిరిన తరువాత ఆతురత పడుదురు. అందరు చెప్పిన సలహాల ప్రకారము మందులు పోయుదురు. ఈరీతిగా రైతువర్గము తమ పశుసంతతిని పాడుచేయుచున్నారు. ఇది నాప్రత్యక్షానుభవము.

## —♦ లంకణముల కట్టించరాదు ♦—

కావున రైతుసోదరులారా! ఈవ్యాధిసోకిన వెంటనే మీగ్రామములోనున్న అనుభవ పశువైద్యము చేయుచున్న స్వదేశ వైద్యులచేగాని మీతాలూకా సివిల్ వెటరినరీ డాక్టర్లచేగాని నిఖిలాంధ్రాయుర్వేద పశువైద్య కళాశాలలో తీర్చబడిన ఆయుర్వేద డాక్టర్లచేగాని చికిత్సచేయించుట మంచిది. కాని తెలిసి తెలియని వైద్యుల సలహాలనడిగి మీపశువులనుచంపిన మీ కుటుంబమునకు మహాపాతకము చుట్టుకొనును. నేను ప్రచారముచేసిన గ్రామాదులలో కొందరు రైతులు తమ పశువులనుగూడ లంకణములుకట్టించి పక్షము దినములవరకు నీరుగాని, ఆహారముగాని, పెట్టెడివారుగారు. అందుచేత అవి ఆహారనాళము ఎండిపోయి క్రమేపిచచ్చుచుండెడివి. కాన ఈ వ్యాధిచే పీడింపబడుచున్న ప్రతిపశువునకు తప్పక కాచినసీరుగాని, నూకలు లేక జొన్నజావగాని ప్రతిదినముపెట్టుట మిగులమంచిది. రైతులలో కొందరు ఈ రోగమును గుర్తించక పలువిధములుగా భావించుచున్నారు. కాని కాలపరిస్థితుల ననుసరించి వ్యాధియొక్క గుణాగుణములుకూడ మార్పుచెందును. ఈ వ్యాధితోగూడ వాతశూల నొప్పులు, కల్లవాపులు తదితరసంధి గుణములు పుట్టుచున్నవి. అందుచేత రైతులాతురపడుట స్వాభావికము. కావున రైతుసోదరులందరు ఈ దిగువ నుదహరించు అంశములు చక్కగా పరీక్షించి తగినచికిత్సలు చేసికొనగలరని నమ్ముచున్నాను.

## —• సూక్ష్మజీవివలనకలుగును •—

ఈ వ్యాధి ప్రాణాపాయకరమైన సన్నిపాత జ్వరరూప మగు అంటుజాడ్యము. సాధారణముగా ఇది ఇంకను గొఱ్ఱెలు మేకలు గుఱ్ఱములు ఒంటెలు మున్నగు జంతువులకుగూడసోకి ప్రాణహాని కలిగించును. ఈ వ్యాధి ఒకవిధమైన సూక్ష్మజీవి వలన కలుగుచున్నది. ఈ సూక్ష్మజీవులు సాధారణముగా గాలిమూలమున పశువుశరీరములో ప్రవేశించి వ్యాధిని కలిగించును. కాని దొమ్మ గురక మున్నగు వ్యాధులను కలిగించు సూక్ష్మజీవులను నీడలోనుంచినట్లయిన రెండు దినములవరకును బ్రతుకును. ఈ జీవులకు సూర్యోష్ణత తగిలినప్పుడు 12 గంటల లోపుగా చనిపోవును. వ్యాధితగిలిన పశువు రక్తమందును మాంస కండరములయందును ఎముకలయందునుగూడ ఈజీవు లాక్రమించుకొనియుండును. కనుక జబ్బుగానున్న పశువుల మలమూత్రములు విసర్జించిన ప్రదేశములం దెల్లెడలను ఈ వ్యాధి వ్యాపించును. అందువలన జబ్బుగానుండు పశువులను జబ్బులేని పశువులనుండి విడదీసి వానికై యేర్పాటుచేయబడిన ప్రత్యేక స్థలమునం దుంచవలెను. పశువుల కొట్టముల కన్నిటి కిని ఘాటుసున్నము కొట్టించినయెడల ఆవాసనకు ఈవ్యాధి కలిగించు సూక్ష్మజీవులు నశించును.

## —• వ్యాధిసోకు విధానము •—

ఇంకను ఈవ్యాధితగిలిన పశువుయొక్క విషాంకురములు రెండు ఫర్లాంగుల దూరము ప్రాకిపోవునని ఒక ఆంగ్లేయ

శాస్త్రజ్ఞుడు తెల్పుచున్నాడు. ఈ రోగముతోనున్న పశువులు మంచిపశువులను నాకుటచేతను, రోగ పశువుయొక్క మలమూత్రములు, చొంగపడిన మేత వగైరాలు మంచిపశువులు తినుటచేతను, తగిలిన పశువున కుపయోగించుతొట్లు, నుట్టి పాత్రలు మున్నగునవి మంచి పశువులకు వాడుటచేతను, మాదిగవాండ్రు తమ బంధువులకు ఈవ్యాధి తగిలిన పశువుల మాంసమును పంపించుట చేతను; ఈవ్యాధితగిలిన గ్రామముల ద్వారా మంచిపశువులను సంతలకు గాని, బంధువుల యిండ్లకుగాని తోలుకొని వెళ్ళుటచేతను, గ్రద్దలు, కోళ్ళు, కాకులు మొదలగు అల్పజంతువులు ఈవ్యాధిచే చనిపోయిన పశుమాంసము నచ్చటచ్చట తినుచు విడుచుటచేతను, చచ్చినపశువులను పాతిపెట్టక పోయుట చేతను, ఇంకను ఈ వ్యాధిసోకిన ఆవు గేదె మున్నగు పశువులను మగపశువులు దాటుట చేతను, ఈ వ్యాధి తప్పక సోకునని ఆంగ్లాయుర్వేద శాస్త్రజ్ఞు లేకగ్రీవముగ చెప్పుచున్నారు. కావున సోదరులగు రైతులారా! ఈ వ్యాధి తగిలిన పశువులను మీరందరు తగు జాగ్రత్త వహించి తగిన చికిత్సలు చేయుటకును, ఈదిగువ వ్రాసిన లక్షణములను గ్రహించుటకును మిమ్ముల ప్రోత్సహించుచున్నాను.

—♦ ఏజంతువుల నెక్కువగా బాధించును ♦—

ఈవ్యాధి గేదెలను, దున్నలను ఎక్కువగా బాధించును ఒక్కొక్క సమయములో రైతునకున్న పశువులన్నియు చనిపోవుటయు గలదు. ఆవులు ఎద్దులు మొదలగు తెల్ల పశువులకు ఈవ్యాధి సోకినను నల్ల పశువులంత ప్రమాదముండదు. కుక్క

లకు గుర్రములకు, ఈవ్యాధి తగిలినను అంత ప్రమాదము లేదు. పందులకు కోళ్లకు ప్రమాద ముండును. ఈవ్యాధి వర్షాకాలము నం దతి తీవ్రముగను, వేసవి కాలమునందు తేలికగను సోకును.

### -♦ లక్షణములు: (Symptoms) ♦-

ఈ వ్యాధి పశువునకు సోకినపిమ్మట బయటకు కనపడుటకు మూడు దినములు మొదలు యేడుదినములవరకు పట్టును. కొన్ని జంతువులకు 10-15 దినములవరకు పట్టును. మరికొన్నిటికి నెలదినములవరకు యేదోయొక రీతిగా బాధపడుచు నేయుండును. పశువుల ఖామందులు కాపరులు ఈజాడ్యము సోకిన అంత్యదశలో అనగా పారుట మొదలుపెట్టిన తరువాత జబ్బు తగిలినదని యూహించుచుందురు. మొదటనే తెలిసికొనుట దుర్లభము. మొదటనే తెలిసికొనిన యెడల జబ్బును సులభ చికిత్సతోడనే బాల్యావస్థలోనే నశింప జేయవచ్చును. జాడ్యము ముదిరి పారుట మొదలు పెట్టిన తరువాత రోగము కుదురుట కష్టము.

### -♦ మొదటి అవస్థ (Fist Stage) ♦-

ఈవ్యాధిసోకిన ఆరంభ దశలో తీవ్రమైన జ్వరము (105, 106 డిగ్రీలు) తగులును. అప్పుడప్పుడు అరమేత మేయుచుండును. పశువుల చెవులనుండి ఒకవిధమైన రసి కారును. తల నిటునటు కొట్టుకొనుచుండును. కొన్ని పశువులు వణకుచుండును. కొన్ని నల్లకవ్వు వేయును. కొన్ని కన్నులనుండి

నీరు గార్చుచుండును. కాళ్లు పట్టివేయును. మలబద్ధక మెక్కువగా నుండి పేడ పెంటి పెంటికలుగా వేయును. కొన్ని పశువులు పేడవేయక తోక నిలబెట్టుకొని యుండును. స్టెతస్కోపుతో పరీక్షించినయెడల గుండె తీవ్రముగా కొట్టుకొనుచుండును. పాడిపశువైన యెడల పాలెండిపోవును. కండ్లు ఎఱ్ఱబడును. కొన్నిటికి నీరుగారుచుండును, పశువు పొడిదగ్గు దగ్గుచుండును. కండ్లనుండి వచ్చునీరు చాల వేడిగానుండును. ఈలక్షణములుగల పశువునకు రొప్ప అనగాముక్కుడు (ఆయాసము, వగర్పు) పుట్టినయెడల ఆపశువు బ్రతుకుట కష్టము. రొప్ప పుట్టుక మునుపే చికిత్స చేయవలెనుగాని, తరువాత నేమియు లాభములేదు.

## —♦ రెండవ అవస్థ (Second stage) ♦—

పశువు నోటిలోపల ఎఱ్ఱగా కందియుండును. మేత మేయుట నెమరువేయుట మానును. చెవులు వ్రేలాడవేయును. జ్వరముతగ్గును. ముక్కులగుండ నోటిగుండ చిక్కసిచొంగ, చీమిడ పడుచుండును. ముక్కులను శుభ్రముగా కడుగనిచో పురుగులు పడును. మూతిచెమ్మ యిగిరిపోయి వేడిగానుండును. కన్నులు బాగుగా పుసులుకట్టును. శరీరమం దేభాగమునందైనను కొన్నిపశువులకు ఒక విధమైన వాపులు (కల్లవాపులు) పుట్టును. ఆవాపులు మిగుల శీతలముగానుండును. కంటికొలుకులు పగిలి పుండ్లగును. ఆడపశువులైనయెడల శరీరము మీద పొక్కులు చితికి ఎఱ్ఱనిపుండ్లగును. ఈపుండ్లనే మనవారు మశూచి యనుచున్నారు. కాని అది మశూచిగాదు.

కండ్లనుండి కారుసీరు ఒగరుగ కారముగనుండును. దాహమెక్కువగనుండును. ఆకలి నిల్చిపోవును. నాడి తీవ్రముగా కొట్టుకొనుచుండును. విరేచనము పసుపుపచ్చరంగుగానుండి చిక్కగా దినమునకు రెండుమూడు పర్యాయములు పారుచుండును.

## -♦ మూడవఅవస్థ (Third stage) ♦-

పశువు చాల శుష్కించిపోవును. చాల విచారముగానుండును. వ్యాధి ముదిరినకొలది విరేచనములరంగు మారి దుర్వాసనగానుండును. పృష్టముతీపు అనగా తేండ్రు బాగుగానుండును. మూల్గుచుండును, ఉచ్ఛ్వాస నిశ్వాసముల నాటంకపరచును. కవుసినీరు మాదిరిగా పారుచుండును. వెఱ్ఱియెత్తినదానివలె మనుష్యులవంక ఆకాశమువంక చూచుచుండును. కన్నీరు ధారగా కార్చుచుండును. విరేచనములు పలుమారగుచుండును. పశువు మిగుల బాధపడుచుండును.

## -♦ నాలుగవ అవస్థ (Fourth Stage) ♦-

పశువుదేహము, కాళ్లు, ముఖము రంగుమారి ముడతలుపడును. శరీరవేడిమితగ్గి శీతలములోనికివచ్చును. మూత్రకోశము చెడిపోవును. నాలుక తెలుపు పసుపు కలిసిన రంగుగానుండును. నోరంతయు ఆరిపోయి దాహ మెక్కువగా నుండును. కొన్ని దాహమును కోరవు. పేగులు అరచుచుండును. కాళ్లనరములు లాగుచుండును. పశువు నిలబడుచు లేచుచు బాధపడుచుండును. దాని చెవులలో ధ్వనిపుట్టును. దేహమంతయు చల్లబడి చెమటపుట్టి దుర్వాసనవేయుచుండును. కండ్లు తోడుకొని

పోవును. పెట్టిన మందులు మలముగుండా బయటకువచ్చును. కండలు కండలుగ రక్తముపారును. చనిపోవుటకుముందు కాళ్లు పారచాపును. తలనిలుపలేదు. తూలుట సంభవించును. క్రమేణ స్మారకము తప్పి చివరకు చనిపోవును.

-♦ సంరక్షణ (Preventive) ♦-

ఈ వ్యాధికి ఔషధసంబంధమైన చికిత్సలకన్న సంరక్షణముచేయుటయే ముఖ్యావసరము. రైతులలో చాలమంది జబ్బుపశువులను చలిగాలిలో నుంచుదురు. ఇది చాల పొరబాటు,పశువునకు చలిగాలితగులనీయక, వర్షమున తడియనీయక గాలి, వెలుతురుండు ప్రదేశములలో కట్టియుంచవలెను. ముక్కులగుండా చీమిడిగాని, నీరుగాని స్రవించుచుండును. ఈ చీమిడిని శుభ్రముగా ఏపూట కాపూట తుడుచుచుండిన యెడల ముక్కురంధ్రములలో పురుగులు పడవు. కండ్లనుగూడ వేడినీటితో కడుగుచుండ వలెను.

—♦ ఆయుర్వేద చికిత్స (Native Treatment) ♦—

రోగము ప్రారంభమైన వెంటనే మోదుగపువ్వు 2 తు; ఉప్పు 4 తులములు; కలి నీరు సేరు.

కలిపి మూడుగొట్టముల వంతున ఆరంభములో రెండు పర్యాయములు పెట్టుము.

లేక

వెదురాకు అరగుప్పెడు, నేలవేము 1 తులము, నల్లేరు

వేళ్లు 2 తులములు, తెల్లఆవాలు 1 తులము, కలినీరు 1 శేరు కలిపి త్రొక్కి ఒక పర్యాయము త్రాగించుము.

లేక

నేలవేము 4 తులములు, మోదుగపువ్వు 6 తులములు, నువ్వులనూనె అర్ధశేరు కలిపి తగిలిన వెంటనే త్రాగించుము.

లేక

నల్లేరు కాడలరసము 3 తులములు; వెల్లుల్లిపాయల రసము 4 తులములు; నువ్వులనూనె అర్ధసేరు.కలిపి ఒకపర్యాయము పెట్టుము.

లేక

చింతపండుపులుసు అర్ధసేరు; ఉప్పు చేరెడు; కలినీరు సేరు - కలిపి త్రాగించుము.

లేక

ముండ్లనుతీసివేసి 3 పౌనుల నాగజెముడును ముక్కలుగాచేసి దానిలో

సొంటి, పిప్పళ్లు, మిరియాలు, సమానభాగములు తాడి కాయలు, కరక్కాయలు, ఉసిరికపప్పు, ఒక్కొకటి 2 తులములవంతున తీసికొని దినమునకు నాలుగైదు పర్యాయములు అర్ధసేరు కలినీటిచే కలిపి త్రాగించవలెను.

## —• శీతలమునకు రానీయరాదు •—

ఈ వ్యాధియందు జాగ్రత్తగా నాహారమిచ్చుటవలనను, సహజముగ శరీరమునందు గలుగుచుండెడివ్యాధి ప్రతీకారమునకు మిగుల కుశలతచే మందులనిచ్చుట మూలమున సహాయము చేయుచుండుటవలనను అనేక పశువుల ప్రాణములను కాపాడవచ్చును. విరేచనములు ప్రారంభమైనపుడు వెంటనే చికిత్సచేయుటవలన ఉపయోగముండగలదు. పశువు శీతల దశలోనుండునపుడు శరీరవేడిమి కాపాడవలెను. పరిశుభ్రముగా గాలివచ్చునట్లు చేయవలెను. ఈవ్యాధిచే కాళ్లు వెన్ను మొదలగు భాగములు శీతలము గ్రమ్మి శరీరము క్షీణగతియందున్న యెడల వేడిమిని బుట్టించుటకును, నాడియొక్క నడకను సరిచేయుటకును తగిన మందీయవలెను. రోగముగల పశువుయొక్క శరీరము అవసరమైనయెడల గొంగళికప్పి వెచ్చగా నుంచవలెను.

## —• చచ్చిపోయిన తరువాత కనుబడు లక్షణములు •—

## (Post Mortem Apperance)

శరీరము కృశించును. కన్నులనుండి నోటినుండి చిక్కని ద్రవము కారును. ఆసనము తోక పలుచని పేడతో మలినమైయుండును. నోటిలోపలను గొంతులోపలను మృదువైన చర్మపుపొరలందుండు పుండ్లు ఒడిసి యుండును. ఆహార కోశములోనుండు పొరలు మార్పుజెందును. చిన్న ప్రేగులలో పొరలు ఎరుపుగా కంది ఉబ్బియుండును. ఆసనపు గొట్టము ఎఱ్ఱగానుండును. నరములన్నియు సడలు యిచ్చును.

షరా:— రైతులలో చాలమంది పలువిధములైన చికిత్సలు చేయుదురు. వారుపయోగించు చికిత్సలు ఈదిగువ తెలియపర్చుచున్నాను. ఒక్కొక్క వ్యాధికి పలువిధములైన చికిత్సలు చెప్పియుంటిని. మీగ్రామములో సకాలమునకు దొరకు చికిత్సలు చేయప్రార్థితులు.

—♦ పారుచున్నయెడల ♦—

పచ్చితుమ్మచెక్క రసము అర్ధశేరు, వెన్నపూస నిమ్మకాయంత, కలినీరు అర్ధశేరు, కలిపి పారుడు తగ్గువరకు దినమునకు రెండు మూడుపర్యాయము లీయవలెను.

లేక

పచ్చినేరేడుచెక్క రసము అర్ధశేరు, కవిరిపొడి ½ తు కలినీరు అర్ధశేరు, కలిపి త్రాగించవలెను.

లేక

దానిమ్మ చిగుళ్లు 4 గుప్పెళ్లు, పెరుగు అర్ధశేరు, మాచికాయపొడి 1 తులము, కలినీరు అర్ధశేరు కలిపి త్రాగించవలెను.

లేక

పైడిపత్తిఆకు రసము అర్ధశేరు, వెన్న నిమ్మకాయంత, మజ్జిగ అర్ధశేరు, కలిపి త్రాగించుము.

లేక

సీమసున్నము 3 తులములు, మాచికాయలపొడి 1½ తు॥

కవిరిపొడి 1 తులము, నల్లమందు ¼ తులము, నూకలగంజి అర్ధశేరు, కలిపి త్రాగించవలెను.

—♦పశువు దేహమునకు శీతలముసోకి ముక్కుచున్న యెడల♦—

సొంటి 2 తులములు, పిప్పళ్లు 2 తులములు, మిరియాలు 2 తులములు, పసుపు 2 తులములు, కరక్కాయలు 1 తులము సారాయి లేక కలిసీరు అర్ధశేరు, కలిపి త్రాగించవలెను.

లేక

ముద్దకర్పూరము 2 తులములు, తాటిబెల్లపునీరు ¼ శేరు కలిపి త్రాగించవలెను.

—♦ దేహమంతయు మిగుల వేడిగానుండి పారుడెక్కువగా నున్నచో ♦—

నేల తంగేడాకు పసరు 3 గొట్టములు, పెరుగు అర్ధశేరు కలిపి త్రాగవలెను.

లేక

అరటిదుంపను తీసికొనివచ్చి మానెడు నీటిలోవేసి దంచి రసము తీసి దానిలో తవ్వెడు పచ్చజొన్నపిండి కలిపి కాచి చల్లార్చి గొట్టముతో లోపలికి పోయవలెను.

లేక

మోదుగ పువ్వు 3 తులములు, జొన్నకలి శేరు, కలిపి త్రాగించవలెను.

—♦ శరీర మంతయు చల్లగా నున్నచో ♦—

ఈపరిస్థితులలో సామాన్యముగా వేడివచ్చుట కష్టము. ఆపశువు బ్రతుకుట అంతకంటె కష్టము. అయినను ఈక్రింది మందులను వాడిన కొంతవరకు లాభముండవచ్చును.

-♦ ఈదిగువ మోతాదు లొక్కసారే ఈయవలెను ♦-

సారాయి 3 డ్రాములు, త్రాగించుము.

లేక

ముద్దకర్పూరము 1 తులము, వేరుసెనగనూనె అర్ధశేరు, కలిపి త్రాగించ వలెను.

లేక

కాడజెముడాకుపసరు అరగొట్టము పెట్టవలెను.

-♦ శరీరము చాల వేడిగా నుండి ముడ్డి తీపున్నచో ♦-

ఈదిగువ మోతాదు ఒకసారి మాత్రమే ఈయవలెను.

చోడిజావ అర్ధశేరు, మజ్జిగ శేరు, కలిపి త్రాగించ వలెను.

లేక

అర్ధశేరు తాటికల్లు త్రాగించ వలెను.

లేక

వేరినెయ్యి అరసోలెడు, పెసర గుగ్గిళ్లు తవ్వెడు, పెన్నేరు దుంప 4 తులములు, కలిపి త్రొక్కి పెట్టవలెను.

లేక

సీమసున్నము 4 తు, కవిరి 4 తు, మాచికాయ 1 తు గంజాయి పత్రి ½ తు, నల్లమందు ¼ తు, నూకలజావ అర్ధశేరు కలిపి త్రాగించవలెను.

-♦ కొన్ని పశువుల శరీరముమీద వాపులు పుట్టుట ♦-

ఈవాపులున్న యెడల ఆరంభములోనే చికిత్సలు చేయవలెను. లేనియెడల ఆవాపులు గడ్డకట్టి నెలదినములవరకు బాధించును.

ఆవాపులపైన చవుడుసున్నము సమానభాగములుగ తీసికొని కలిపి చుక్కలు చుక్కలుగ పెట్టవలెను.

లేక

అంతకు తగ్గక వాపు గట్టిగానున్నచో పొక్కు మందులు వాడుము.

లేక

చేదుజీలకర్ర ½ తు, ఆవపిండి ¼ తు, దుష్టపాకు పసరు తగినంత, కలిపి వాపులకు రాయవలెను.

ఒక గంటసేపుండి ఇసుక బాగుగా వేడిజేసి గుడ్డలోగాని గోనిపట్టాలోగాని వేసి ఆవాపులపైన కాపులు తీయవలెను.

-♦ నోటిలోని పుండ్లకు ♦-

పటిక ½ తు, వేడినీరు సేరు, కలిపి నోరు కడుగుచుండవలెను.

లేక

తుమ్మచెక్క నీటితోగాని, నేరేడు చెక్క నీటితోగాని, మాచికాయపొడి నీటితోగాని పుండ్లను కడుగుచుండవలెను.

## -♦ పథ్యము (Preventive) ♦-

ఆహార విషయములో మొదటిదశ, రెండవ దశలో సగము వరకు అరమేత మేయును. తరువాత నేమియు ముట్టుకొనదు. అప్పుడు నూకలజావగాని, జొన్నజావగాని, కాచి అర్ధసేరులేక సేరు పెట్టవలెను. ఆజావలో కొంచెము ఉప్పుకలుప వచ్చును. నూకలజావలో వాతమున్నదను యుద్దేశముతో చాలమంది రైతులు పెట్టరు. దీనిలో వాతగుణ మేమియులేదు. పారుడు పుట్టదు. ఈజావలో వేడిమిని కలిగించి జీర్ణశక్తి గలిగించు గుణము కలదు. పశువు నిస్త్రాణ జెందదు. లోపల దండిగానుండును. కాబట్టి ఈజావ పెట్టుట మంచిది.

లంకణము చేయించుచుందురు. ఇది చాలపొరబాటు, మనుష్యుడేవిధముగ లంకణముచేయక ధారకము చేయుచున్నాడో ఆవిధముగనే దీనికి కూడ ధారకము చేయించవలెను. కాచిననీరు త్రాగించవలెను. చన్నీటిని ఏమాత్రము వాడరాదు. ఇంకను మేత మేయవలెనని కోరిక యున్నయెడల మెత్తని పచ్చిగడ్డి పెట్టవలెను. జనుపకాడ యేమాత్రము పెట్టరాదు. గరుకుగానుండు వస్తువులు పెట్టినయెడల నోటిలోని పుండ్లు పెద్దవై పశువునకు చాల బాధ కలిగించును. వ్యాధి ప్రారంభించినది లగాయతు పక్షము దినములలోపల

యేమాత్రము చన్నీరు త్రాగినను పశువునకు శీతలముసోకి సంధిపుట్టి కడుపుబ్బి చనిపోవును.

పశువు తనంతటతాను జావత్రాగినయెడల లోనికి పోయరాదు. కొంచెము బలవంతముమీద పెట్టవచ్చును. పశువునకు తినవలెనని కోరికయున్నయెడల జొన్నలు వండి మంచినూనె (మడ్డికూడు) కలిపి పెట్టవచ్చును. కానిఎక్కువగా పెట్టరాదు. అర్ధ ఆహారమే పెట్టవలెను. వ్యాధి నెమ్మదించిన దని తెలిసిన తరువాత వారము దినములవరకుకూడ కాచిన నీరు పెట్టుటయే మంచిది. లేక నూతిలో నీరుతోడి కడవ క్రింద పెట్టకుండ ఆనీరుకూడ పోయవచ్చును. ఈవ్యాధితగిలిన పశువు మలమూత్రములతో నిండినగడ్డి వగైరాలు కాల్చి వేయవలెను. ఫినైల్లోషన్‌తోగాని సున్నపునీటితోగాని దొడ్డియంతయు శుభ్రము చేయవలెను.ఇంకను దొడ్డిలో ఈగలెక్కువగా నున్న యెడల ఇంగ్లీషుమందుల షాపులలో దొరకు ఈగలకాగిత ములు తెచ్చి ఉపయోగించవచ్చును. అప్పుడప్పుడు గంధకపు పొగగాని సాంబ్రాణి పొగగాని వేయుటమంచిది. జబ్బుపశువు లను తాకిన మనిషి తన చేతులను కాళ్లను శుభ్రముగాకడుగు కొనవలెను. పాలపాత్రలను వేడినీటితో కడుగవలెను. కుక్క లను కాకులను దొడ్డిలోనికి రానీయరాదు. గోడలకు ఘాట యిన సున్నము కొట్టవలెను. వేపాకు తోరణములు కట్టుట మంచిది.

## — చూడిపశువులకు చికిత్స —

సామాన్యముగా చూడిపశువుల కేవిధమైనమందులు పెట్టరాదు. ఈవ్యాధితగిలిన పశువులు బ్రతుకుట దుర్లభమే. తేలికగా సోకిన పశువులు మాత్రము బ్రతుకును. ఒకవేళ బ్రతికినను లోపలపిండము ఈచుకొని పోవును. కాని కొన్ని పశువులకు చికిత్సలుచేసిన లోపలిపిండముపోయి పెద్దపశువైనను బ్రతుకుట అక్కడక్కడ చూచుచున్నాము. పశువులోపలి పిండము పోయిన యెడల అనుభవముగల పశువైద్యునితో చికిత్స చేయించవలెను. అనేక శాస్త్రములు చదివి ఇంగ్లీషుశాస్త్రములందు తీర్ణులైన వెటరినరీ డాక్టర్లకంటే ఆయుర్వేద పశువైద్యులలో మిక్కిలి తెలివిగలవారున్నారు. ఇటువంటి వైద్యులను పోషించుదాతలు లేక వైద్యవృత్తిని విసర్జించి యితరవృత్తులలో ప్రవేశించుటవలన ఆయుర్వేద పశువైద్యము అనుభవములో క్రమక్రమముగా అంతర్ధానమగుచున్నది. గాన విద్యాపోషకులగు జమీందారులు కృషీవలులగు పెద్దభూస్వాములు వడ్డీవ్యాపారులు తమ తమ ప్రదేశములలోగల ఆయుర్వేద పశువైద్యులను పోషించుచు పూర్వమొకప్పుడు ప్రఖ్యాతిగాంచిన మన వైద్యశాస్త్రములు పోకుండ నుద్ధరించుదురని నమ్ముచున్నాను వైద్య మితరులకు చెప్పినచో దానికి శక్తి తగ్గిపోవునని విద్యాహీనులైన పూర్వాచారపరాయణులగు కొందరు పశువైద్యులు అభిప్రాయపడుచుందురు. ఇది చాల పొరబాటు. విద్యాభిమానులు పత్రికాపఠనాభ్యాసములేని స్థానిక ఆయుర్వేదవైద్యులచేత ఆప్రాంతములందు వాడు

చున్న చికిత్సాపద్ధతులను రోగనిదానములను పత్రికాముఖ మున వెల్లడిజేసి రైతులోక ముద్ధరించుదురుగాక యని నాప్రార్థన.

## —♦ చికిత్స (Native Treatment) ♦—

వాముకసము అర్ధసేరు, చింతపండు తేలికపులుసు ఒక గొట్టము, కలినీరు అర్ధసేరు కలిపి ఆరంభమైన వెంటనే త్రాగించవలెను.

లేక

మోదుగపువ్వు 2 తు బియ్యపుకలి అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

మానములు రాకమునుపుగాని మానములువచ్చిన తరువాతగాని లోపలి పిండముపోయి బాధపడుచున్న యెడల పశువు సొమ్మసిల్లును. శరీరమంతయు దుర్గంధపు చెమటపట్టును. గర్భమునుండి రక్తము స్రవించును. మూత్రము జారీగానగును. మట్టు ఎక్కువగా పడుచుండును. ఆయాసమెక్కువగా నుండును. ఇటువంటి లక్షణములు కలిగినవెంటనే డాక్టరును పిలిపించి పిండమును తీసివేయించవలెను. డాక్టరు దొరకనిచో అనుభవముగల పశువైద్యుని పిలిపించవలెను. వెంటనే సేరు - రెండు సేర్ల వేడినీరు త్రాగించవలెను. లోపల నీటితో మానమును శుభ్రముగా కడగవలెను. వెన్నెముకకు వెనుకభాగమునకు పుట్టమన్ను ఉడికించి కొట్టవలెను.

—♦ పిండమును లాగినతరువాత ♦—

ఆవుపాలు సేరు, ముల్తాణియింగువ 3 తులములు, తుమ్మాకుపసరు అర్థసేరు తెచ్చి కలిపి దానిలో ఎఱ్ఱగా కాలిన కొండపాలరాయిగాని కంకరరాయిగాని వేసి కొంచము సేపుంచి తీసి ఆవేడిపాలు త్రాగించవలెను. ఈపాలు త్రాగించిన యెడల పశువునకు శీతవాతము తగులకుండ నుండును. తరువాత ఒక గంటసేపాగి నూకలజావ సేరు పెట్టవలెను.

—♦ మష్టు (మైల) పడుచుండిన యెడల ♦—

పెసరగుగ్గిళ్లు సోలెడు, పెన్నేరుదుంప 4 తులములు, పేరినెయ్యి గిద్దెడు కలిపి పెట్టవలెను.

శరీరమంతయు పుండ్లుబడి ఎరుపుగానుండిన యెడల ఇదివరకు చెప్పిన చికిత్సలు చేయవలెను. ఈగలు ముసురుకొనిన యెడల ఫినైల్ నీటిలో కలిపి చల్లవలెను. మేతతిన నిష్టమున్న యెడల మెత్తని పచ్చిమేత వేయవలెను. నీటినికాచి కొంచెము చల్లార్చి త్రాగించవలెను.

షరా:—వ్యాధితగిలిన పశువులు దాహమున కోర్వలేక పశుఖామందు లేసప్పుడు అవి త్రాళ్లుతెంచుకొని చెరువుల లోనికి కాలువలలోనికి పోయి వాటి యిష్టమువచ్చినంత నీరు త్రాగును. అట్లు నీరుత్రాగినపశువు ఒకటిరెండుగంటలలో శీతలము సంభవించి కడుపుబ్బి సంధిపుట్టి చనిపోవును. కావున రైతులందరు ఈవ్యాధితోనున్న పశువులను జాగ్రత్తగా చూచుచుండవలెను.

## —♦ పెద్దరోగమును నిలుపు మార్గములు ♦—

ఒక గ్రామమునందు ఈజాడ్య మారంభమైనపుడు జాడ్యము తగిలినవాటిని ప్రత్యేకముగా నుంచి తగు చికిత్సలు చేయవలెను. అంటుజాడ్యము సోకినదని అనుమానింపదగిన పశువును విడిగా నుంచవలెను.

రోగపశువు నివసించియున్న స్థలమునకు సంబంధించిన కొట్టపుగోడలు, నేల, నీటితొట్టెలు, మున్నగువానిని శుభ్రముగా నుంచవలెను. రోగపశువులకు చికిత్స చేయువారలను గాని, అంటు సోకియుండు స్థలములలో తిరుగు కుక్కలనుగాని, కాకులు మున్నగువానిని గాని మంచిపశువులున్న ప్రదేశములకు రానీయరాదు.

పెద్దరోగము సంభవించిన వెంటనే మీ తాలూకా వెటరినరీ డాక్టరుగారిచేగాని, మీ ఫిర్కా ఆయుర్వేద పశువైద్య డాక్టరుగారితోగాని టీకాలు వేయించుట మంచిది. ఇట్లు చేయుటవలన ఈవ్యాధిని పారద్రోలవచ్చును. పశువు శరీరము శుభ్రముగా నుంచవలెను.

ఆరోగ్య సహితమయిన మేతగాని, దాణాదినుసులుగాని పెట్టవచ్చును. పరిశుభ్రమగు నీటిని త్రాగించవలెను. ఈవ్యాధి గ్రామమునం దంతటను వ్యాపించియున్నపుడు చచ్చిన పశువులను కోయించక ప్రత్యేకస్థలమందు పూడ్చిపెట్టుట మంచిది.

ఈవాధి వ్యాపించియున్నపుడు మామూలు అలవాటులయం దేవిధమగు మార్పులను జేయరాదు. రోగమునుండి తేలిన

పశువులను కనీసమొక పక్షముదినముల వరకైనను విడిగానుంచి తరువాత పశువుశరీరము శుభ్రముగా కడిగి మందలో కలుపవలెను.

## —♦ కళేబరముల విషయము ♦—

పెద్దరోగముచే చనిపోయిన పశువులను కాల్చివేయవలెను. లేక సున్నముగాని, ఉప్పుగాని వేసి పాతిపెట్టవలెను. అప్పుడు వ్యాధికి కారణమగు సూక్ష్మజీవులు నశించును. చనిపోయిన పశువులను కొందరు ప్రవహించునదులలోనికి విడిచెదరు. మరికొందరు గ్రామసమీపముననే కోసివేయుదురు. ఇట్లు కోసివేసిన పశువుల చెడుగాలులు గ్రామములోనున్న పశువులమీదకు వీచి వ్యాధిని పెంపొందజేయును. ఇటువంటి పనులు చాల నష్టము కలుగజేయును. కాని మనుష్యులవలెనే పశులనుగూడ కాల్చుటయందెట్టి యాక్షేపణయులేదు. ఇందుకు ప్రత్యేకముగా బట్టీలుండును. వీనిలో కాల్చుట మంచిది. వ్యయభీతిచే శవమును బాగుగా కాల్చకుండుట గర్హ్యము. పాతివేయుటకూడ మంచిపద్ధతియే. గోతులుమాత్రము 10, 12 అడుగుల లోతునకు తక్కువగా నుండరాదు. చచ్చిపోయిన జంతువులను పారవేయు స్మశానములు, కాపురముండు స్థలములకును, జలాశయములకును సాధ్యమైనంత యెక్కువ దూరముగ నుండవలెను. కళేబరములను నదులలో పారవేయుటయు, శిఖరములపై వదలుటయు దుర్గంధములకు మూలకారణము లగుటయేగాక అనేక రోగములకు కారణములగును.

## —♦ టీకాలు వేయుట ♦—

మందలమందలుగా పశువు లొక్కసారి చనిపోవుట ఈ వ్యాధివలనేనని రైతు లెరుంగుదురు. కాని వానిని మాన్పు సాధనము టీకాలువేయుటయే. గవర్నమెంటు వా రీవ్యాధిని టీకాలు వేసి మాన్పుచున్నారు. ఈ వ్యాధినిబుట్టించు సూక్ష్మ జీవులు పశువు శరీరములో ప్రవేశించుటవలన ఆ వ్యాధి కలుగును. శరీరములో ఈ జీవులు చేరని పక్షమున ఆ వ్యాధి కలుగుట కవకాశములేదు. ఈ సూక్ష్మజీవు లతి సూక్ష్మతరములు అవి అణుదర్శిని సహాయములేక దృగ్గోచరములుకావు. అణుదర్శినితో జూచిన అతిస్పష్టముగా కనబడునుగాని విడిగా కన్పించవు. అట్టివి శాస్త్రవిజ్ఞానముచేత కనుగొనబడును. పశువులఆరోగ్యము వాని రక్తమునుబట్టి యుండును. ఒకప్పుడు వ్యాధి అంటినను అంటకున్నను మొత్తముమీద వ్యాధిరాకుండ కాపాడుకొనగల గుణము రక్తమునందే గలదు.

ఈవ్యాధితగిలి స్వస్థతపొందిన పశువునకు ఈవ్యాధి మరల రాదని మీకు తెలిసియేయుండును. ఈవ్యాధి తగులుటయన ఈ తెగులున కనువగు జీవాణువులు పుట్టుట. అవి క్షణకాలములో పుట్టి కోట్లకొలదిగా వృద్ధిజెంది జంతునాళములలో నుండు రక్తములోనికి వ్యాధిని రానీయకుండ కాపాడదగు శక్తిని క్షీణింపజేయును. ఈవ్యాధి నెమ్మదించవలెననిన అట్టి జీవాణువులు రక్తమందు వృద్ధియగుకొలది అంటువ్యాధియొక్క జీవాణువులు రూపుమాసిపోవలెననిన జబ్బుపశువుయొక్క రక్త మొకగ్లాసులో పోసి రెండుగడియలసేపు నీటిలోపెట్టిన

యెడల ఆరక్తమునుండి ఒక విధమైన ద్రవమేర్పడి క్రమముగా రక్తము పైన తేరుకొనును. ఆరక్తమందలి ఈపచ్చని పదార్థమే అంటువ్యాధులను నిర్మూలించు సామర్థ్యముకలది. ఈద్రవమును ముక్తిసార్ అనుప్రదేశమునను మదరాసులోను గవర్నమెంటు ఔషధశాలలలో అనుభవజ్ఞులగు శాస్త్రజ్ఞులవలన తయారు చేయబడుచున్నది.

పెద్దరోగము తగిలియు బాగుగాలేచి తిరుగుచున్న మంచియెద్దులనుండి ఈద్రవము తీయబడుచున్నది. ఈద్రవము కొంచెము శరీరములోని కెక్కించిన అంటువ్యాధులను దరికి రానీయనంత బలముగలిగించును. ఈవ్యాధి కుపయోగింపబడు మందును చాలజాగ్రత్తగా వాడవలెను. గ్రామమంతయు ఈవ్యాధి సోకినప్పుడు టీకాలు వేయించుట మంచిది. ఈటీకాలు వేయుపద్ధతి తదితర పశువైద్యులకు నేర్పుట మంచిది.

## ——♦ ఆంగ్లేయచికిత్స (Allopathic Treatment) ♦——

వ్యాధి సోకినవెంటనే క్రిసాల్ 1 తు, నూకలజావ సేరు కలిపి త్రాగించవలెను.

లేక

పొటాషియంపర్మాంగనేట్ లోషన్‌ను చిక్కగా కలిపి మూడుదినములు వరుసగా సేరువంతున పెట్టవలెను.

లేక

కార్బాలిక్ ఆసిడ్ 1 డ్రాము, నూకలజావ శేరు కలిపి త్రాగించవలెను.

—♦ పారుడెక్కువగానున్నచో ♦—

క్యాంఫర్ డైన్‌గాని; క్లోరిడైన్‌గాని 3 డ్రాములు, నీరు సేరు కలిపి దినమునకు రెండు పర్యాయములు ఈయవలెను.

లేక

కాచు 2 డ్రాములు, ఛాక్ పిప్రేటా 1 ఔన్సు, సినమన్ 2 డ్రాములు, జింజర్ 2 డ్రాములు సేరుగంజిలో కలిపి పెట్టవలెను.

లేక

కాచు 2 డ్రాములు, గాల్సుపొడి 4 డ్రాములు, ఓపియం 1 డ్రాము, అనిసీడ్ 1 ఔన్సు, గంజి సేరు కలిపి త్రాగించవలెను

—♦ నోటిపుండ్లకు ♦—

పొటాస్‌క్లోరస్ ½ ఔ, తేనెగాని, జెల్లముగాని తగినంత కలిపి రాయవలెను.

లేక

ఆలంలోషన్‌గాని, పొటాషియంపర్మాంగనేట్ లోషను గాని అప్పుడప్పుడు నోటికి పుక్కిలింపు చేయించిన గారపట్టును.

—♦ చర్మముపైన పుండ్లున్నయెడల ♦—

బోరిక్ ఆయింటుమెంటుగాని, జింకుఆక్సైడ్ ఆయింటుమెంటుగాని, కార్బాలిక్ ఆయింటుమెంటుగాని తీసికొని దానిలో తగినంత నీమ్‌ఆయిల్ కలిపి వ్రాయవలెను.

—♦ సారూప్యచికిత్స(Homoeopathic Treatment) ♦—

వ్యాధి తగిలినవెంటనే అకోనిటంనాప్‌నుగాని లేక ఆర్సె నికం ఆల్బంనుగాని ఈయవలెను.

బొబ్బలు దద్దురులున్నయెడల ఆంటిమోనియం టార్టానుప్రతిమూడుగంటలకు ఒక గ్రెయినువంతున ఈయ వలెను.

పొక్కులు ఎండిన తరువాత స్పిరిట్సుఆఫ్ క్యాంపర్ ప్రతి 10 లేక 15 నిమిషములకు 20 చుక్కలవంతున ఈయ వలెను.

చర్మముపైన గజ్జియున్నయెడల సల్ఫర్ బాగుగా పని చేయును.

## దొమ్మరోగము (Anthrax)

### —♦ స్వభావము (Distribution) ♦—

పశువులకు సంభవించు వ్యాధు లన్నిటిలోను ఈ దొమ్మ మిగుల హానికరమైనది. ఇది ఒక జంతువునుండి మరి యొక జంతువునకు సోకు రోగము. ఈరోగము మనుష్యులకు గూడ గలుగునని వైద్యశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. ఈ వ్యాధిని వర్ణించుటకు బహు కష్టతరము. ఎంతో అనుభవము గల పశువైద్యుడుగాని గ్రహింపజాలడు. ఈ వ్యాధి పలువిధ ములుగా కాల పరిస్థితులనుబట్టి వచ్చుచుండును. పెద్ద రోగము తగిలిన పశువువలె ఎక్కువకాల ముండక గంటల

ప్రికారము చనిపోవును. అందుచే రైతులు తమ బండియెడ్లకు ఈవ్యాధి సోకగానే వాడు పడు ఆతురత ఇంతింతయని చెప్ప నలవిగాదు. ఈవ్యాధి జ్యేష్ఠాషాఢమాసములలో తరుచుగా నుండును. ఈ వ్యాధిని కలిగించు సూక్ష్మజీవులు మట్టితోకలిసి యుండును. ఈ జీవులు బురదగానుండు నేలలలోజేరి మిక్కుటముగా నుండును.

ఈ సూక్ష్మజీవులగుడ్లు సీలుచేసిన గొట్టములోపెట్టి కాపాడగా 22 సంవత్సరములవరకు బ్రతికినవని లూయీ పాస్టర్ దొరగారు చెప్పుచున్నారు. పల్లపునేలలో నుండు గడ్డి వేళ్ళను సూక్ష్మజీవు లంటుకొనియుండి పశువులు మేయునపుడు ఆ గడ్డితోగూడ శరీరములోనికి ప్రవేసించును. అప్పుడు ఈ రోగము తటస్థించును. ఇంక నీవ్యాధి కొన్నివిధములైన ఎరువుల ద్వారాకూడ సోకునని వెటరినరీవారు తెలుపుచున్నారు. దొమ్మరోగవిషజీవులు చాల మొండివి. పెద్దరోగపువిషజీవుల వలె మృతినొందక అనేకసంవత్సరములవరకు జీవించియుండును. అందుచే నీవ్యాధిచే చనిపోయినపశువును వెంటనే పాతిపెట్టుటగాని, కాల్చివేయుటగాని, చాలమంచిపనియైయున్నది. ఇంకను ఎట్టులు విశేషముగా నుండునేలలో ఈవ్యాధి యెక్కువ ప్రసరించుచుండును. చచ్చిన జంతువులను కాల్చక పాతిపెట్టక పోవుటచేతను, ప్రవహించు కాలువలలోను, నదులలోను, కళేబరములను పాతివేయుటచేతను, ఈవ్యాధిచే బాధపడు పశువుదగ్గరనున్న మలమూత్రాదులు మున్నగునవి బాగుచేయక అచ్చటనే యుంచుటచేతను, ఈరోగపశువు నెత్తురుమీ

దను, తదితర స్థానములందును ఈగలువ్రాలి అవి మరల మంచి పశువుల పుండ్లమీదగాని గాయములమీదగాని, వ్రాలుటచే తను ఈవ్యాధి ఎక్కువగుచుండును. ఈవ్యాధి తగిలిన జంతువు లలో నూటికి 90 వరకు చనిపోవును. చూడిపశువులకు ఈవ్యాధి తగిలినను లోపలి పిండమునకు మాత్రము తగుల దనియు, అక్కడ విషజీవులను చంపుపదార్థమొకటి యున్న దనియు కొందరుపశువైద్యులు చెప్పుచున్నారు. ఈవ్యాధి పశువులకు, పందులకు, గుఱ్ఱములకు, గాడిదలకు, మేకలకు, గొఱ్ఱెలకు, ఎలుకలకుకూడ తగులును. ఈజాడ్యపు విషాంకుర ములు మనుష్యులకుండు గాయములలోగుండా ప్రవేశించి రాచపుండ్లు పెద్దపెద్ద చెడువ్రణములు పుట్టును. కాబట్టి ఈవ్యాధిగల పశువునకు చికిత్సచేయువైద్యుడు పరిశుభ్రము గానుండి జాగ్రత్తగా చికిత్స చేయవలెను.

—♦ లక్షణములు (Symptoms) ♦—

పశువు ఆరోగ్యముగనుండినట్లేయుండి అకస్మాత్తుగా చని పోవుటయు గలదు. అట్లుగాక లక్షణములు కనపడినయెడల జంతువునకు తీవ్రమైన జ్వరము 106, 107 డిగ్రీల వేడిమి కలు గును. పశువు గజగజ వణకుచుండును. కన్నులనుండి నీరుగా ర్చును. కన్ను, ముక్కు, నోరు, మొదలగు వానిలోపలి మృదు చర్మపుపొరలు ఎక్కువగా కంది యుండును. కాళ్లుగుదులుపట్టి నిలువ లేక తూలుచుండును. పశువు నల్లకప్పు వేయును. మరి కొన్ని జంతువులు వేయవు. చెవులను వ్రేలాడవేయును. ముక్కుల యందు దేమాత్రపు చెమట యుండదు. ఆయాస

మెక్కువగా నుండును. లోపలికఫము బయటకు తన్నుచుండుట చేత నాలుకను జారవిడచును. కండ్లు గిరగిరత్రిప్పి ఆసనము గుండా నెత్తురు విడచును. పశువు నిలువలేక తన్నుకొని అరచి నేలమీదపడి చనిపోవును. వ్యాధి 2 నుండి 3 దినములలోగా చచ్చుటయో బ్రతుకుటయోక నపడును.

## —♦ చచ్చినతరువాత కనబడు లక్షణములు ♦—

## (Post Mortem Appearances)

ఆసనము బయటకు వచ్చును. కడుపు బాగుగా ఉబ్బును. రక్తము నల్లగా నుండును. లోపలిఅవయవములు కందియుండును. కండ్లు మూతబడకయే నీరుగారుచుండును. శరీరరూపము మారును.

## —♦ ఆయుర్వేదచికిత్సలు (Native Treatments) ♦—

అర్ధసేరు మిరపకాయలు సేరునీటిలోవేసి సల సల మరుగకాగనియ్యవలెను. తరువాత మిరపకాయలు మెత్తగా పిసికి పిప్పితీసివేసి ఆ నీటిని త్రాగించవలెను. ఈ నీటినే కారపు పాలందురు.

లేక

సొంటి 2 తు, పిప్పళ్లు 2 తు, మిరియాలు 1 తు, కరక్కాయలు 1 తు, ఉసరికపప్పు 2 తు, పసుపు 2 తు, తెచ్చి పొడిజేసి అర్ధసేరు చింతపండుపులుసులోనైనను, అర్ధ సేరు కలినీటిలోనైనను కలిపి ఒకపర్యాయము మాత్రమే త్రాగించవలెను.

లేక

సారాయి 3 డ్రాములు, గజపిప్పళ్లపొడి 4 తు, కలిపి త్రాగించవలెను.

లేక

మనుజుని మూత్రము అర్ధసేరు, వేయించిన ఉలవలు సోలెడు, తెచ్చి ముందు గొట్టములో మూత్రముపోసి వేడిగా నుండు ఉలవలు గొట్టముచివరపెట్టి నోటిలోపోయవలెను.

లేక

దిరిశెనపువేళ్ళచెక్కరసము 2 సేర్లు, సొంటి 2 తు, పిప్పళ్లు 2 తు, మిరియాలు 2 తు, కలిపి కాచిపెట్టిన తగ్గును.

లేక

పసుపు 2 తు, మ్రానిపసుపు 1 తు, శొంఠి 2 తు, పిప్పళ్లు 1½ తు, మిరియాలు 2 తు, మేకపంచితము సేరు, కలిపి త్రాగించిన తగ్గును.

షరా:-ఈవ్యాధి చికిత్సకు లొంగదను యుద్దేశ మున్న యెడల రక్షలు వేయవలెను. ఈవాతలనుగురించి నాచే రచింపబడిన రాక్షసవైద్యము చూడుడు. నీరుకాచి చల్లార్చి అర్ధసేరు పెట్టవలెను. తగిలిన రెండుదినములవరకు నీరు పెట్టరాదు.

—♦ దొమ్మరోగమునకు టీకాలు ♦—.

ఈవ్యాధి ఒకవిధమైన సూక్ష్మజీవివలన కలుగుచున్నదని ఇదివరకే చెప్పియుంటిమి. ఈవ్యాధిచే చనిపోయిన జంతువుయొక్క రక్తము తీసి మంచిపశువుచెర్మములోని కెక్కించిన

యెడల రెండుదినములలో దానికి తప్పక ఈరోగము సంభవించును. అందుచేత నిటువంటి రక్తములోనున్న విషజీవులను చంపుటకు తగిన రసము తయారు చేయవలసియున్నది. అందుచే ఆంగ్లేయశాస్త్రజ్ఞులగు శ్రీపాస్టి దొరగారు, చెంబరులాండు దొరగారు, రాక్సుదొరగారు వీరు ముగ్గురు ఈవ్యాధిని కలిగించు సూక్ష్మజీవులను చంపుటకు తగిన టీకాలరసము తయారుచేసిరి. ఈరసము బోలుసూదిచే చర్మము క్రింది కెక్కించినయెడల సంవత్సరమువరకు ఈవ్యాధి రానేరదనియు, హంగేరియా దేశములో దొమ్మవ్యాధి తీవ్రముగా నున్నపుడు ఈటీకాలరసము 750 పశువులకు ఇంజెక్షన్ చేయబడినదనియు అట్లు చేసినపిదప నూటికి 5 వంతున మాత్రమే మృతినొందిన వనియు శ్రీ ఎడ్వర్డు జెన్నరు దొరగారు చెప్పిరి.

—♦ హెచ్చరిక (Prevention) ♦—

ఈ వ్యాధి మనుష్యులకుకూడ సోకును. ప్రాణహాని కరమైనదని అందరకు తెలిసినవిషయమే కదా? దొమ్మరోగము తగిలిన జంతువుయొక్కగాని అట్టి జాడ్యమువలన చచ్చిన జంతువుయొక్కగాని రక్తము మనుష్యునియొక్క దేహము లోనికి గాయముల మూలమున ప్రవేశించును. వెంటనే రాచపుండ్లు తదితర కురుపులు లేచును. ఈరోగముచే చనిపోయిన జంతువుల ఎండుతోళ్ళ మూలముననుకూడ ఈ వ్యాధిసోకి ప్రాణాపాయము కలిగించును. కంబళ్లునేయబడు బొచ్చులో ఈవ్యాధిచే చనిపోయిన గొఱ్ఱెబొచ్చు కలుపబడి యుండును. ఈకలితీకంబళ్ల మూలమున ఈవ్యాధి మనుష్యులకు సోకి చాల

మంది చనిపోవుచున్నారని తెలియుచున్నది. క్షురకర్మ చేయించుకొనినపుడు వాడుకొను బ్రష్షులవలనకూడ ఈవ్యాధిసోకి రాచపుండ్లరూపమున మనుష్యులను బాధించుచున్నదని డాక్టర్లు చెప్పుచున్నారు. అందుచేతనే తదితరదేశముల కెగుమతి చేయు తోళ్లు బొచ్చు మొదలగు సామగ్రిని పశువైద్య డిపార్టుమెంటు వారు పరీక్షజేసి పైకి పంపుచున్నారు. కాబట్టి ఈవ్యాధి తగిలిన పశువులను పశువైద్యుడు చాలజాగ్రత్తగా చికిత్స చేయవలెను. రైతులుకూడ చాలజాగ్రత్తగా సంచరించు టత్యావసరము.

## —♦ మిడిదొమ్మ (Anthrax) ♦—

దీనినే మనవారు గుండెదొమ్మ, తిరుగుడుదొమ్మ అని కూడ చెప్పుదురు.

## —♦ స్వభావము - వ్యాపకము (Distribution) ♦—

ఇది ఒకవిధమైన సూక్ష్మజీవులవలన కలుగును. ఈ సూక్ష్మజీవి ప్రాణవాయువు లేనియెడల జీవింపజాలదు. జీర్ణకోశము తగినంతపని చేయలేకపోవుటచేతను, రక్తహీనతవలనను, అజీర్తివలనను, గుండె అదరుటవలనను ఈ వ్యాధి వచ్చును. లేదా ఒకటి రెండు దినములకు తరువాత తీక్ష్ణమైన గుణములు పుట్టి మృతినొందును. ఈ వ్యాధిచేత పశువులకును, బాగుగా కండబట్టి బలిసియున్నగిత్తలకును సోకును. ఈ వ్యాధి తగిలిన పశువు బ్రతుకుట సామాన్యముగా దుర్లభము.

## —♦ లక్షణములు (Symptoms) ♦—

ఆరంభములో మందమతిగానుండును. అరమేత మేయును. పశువు నల్లకప్పువేయును. జ్వరము తీవ్రముగానుండును. మొదటి

లోనికి నెత్తురు విశేషముగా పోవుచుండును. గుండె చెడిపోవును. ముక్కు-రంధ్రములమీద వాపు పుట్టి క్రమముగా పెద్దదగును. మూతియు లావుపారును; అప్పుడు ఊపిరిపీల్చుట కష్టముగా నుండి చొంగ ఎక్కు-వగా పడుచుండును. చనిపోవుముందు వెఱ్ఱి చూపులు చూచును. పశువునడుముమీద నొత్తిన కుంగును. కొన్ని రక్తమిశ్రిత మూత్రముపోయును. మరికొన్ని పారు కొనును. తుదకు ఒకవిధమైన గొంతు పుట్టి ఊపిరాడక చనిపోవును.

## —♦ చచ్చినతరువాత లక్షణములు ♦—

## (Post Mortem Appearances)

నోరువాచి పాచి దుర్వాసన వేయును. నాలుక లావు బారి యుండును. వాపు బురబుర లాడుచుండును. కండ్లనుండి నీరుగారుచుండును. మూతిమీద వాపుకోసి చూడగా పసుపు వర్ణముగల ద్రవము చేరియుండును. ఈద్రవము విషపురు గులచే నిండియుండును. ఈద్రవము ఒకవిధమైన యేదు వాసనగలిగి యుండును. గుండె ఎఱుపుగా కంది యుండును. ప్రేగులు చీల్చిచూడగా నీలిరంగుగా నుండును.

## —♦ ఆయుర్వేదచికిత్స (Native Treatment) ♦—

ఈవ్యాధికి ముఖ్యమైనగుర్తు మూతిమీద వాపేమై యున్నది. ఈవాపు పుట్టకముందె చికిత్స చేయువలెను గాని తరువాత లాభము లేదు. ఆరంభములోనే "రాక్షసవైద్యము" లోని చికిత్సలుచూచి వెంటనే చేయువలెను.

—♦ వాపు పుట్టకముందు చేయవలసిన పని ♦—

ఈదిగువ చూపించిన మోతాదు లొకసారే ఈయవలెను.

సారాయి 3 డ్రాములు, ముద్దకర్పూరము 1 తు, కలిపి త్రాగించుము.

లేక

వెల్లుల్లిపాయలు అర్ధశేరునవటాకు, ఉప్పు చేరెడు, ములగచెక్కరసము అర్ధసేరు, పసుపు 2 తు, కరిధూపము 3 తు, మేకపంచితము అర్ధసేరు, కలిపి త్రాగించవలెను.

లేక

పసుపు 1 తు, మ్రానిపసుపు 2 తు, సొంటి 2 తు, పిప్పళ్ళు 1 తు, మిరియాలు 2 తు, మేకపంచితము సేరు, కలిపి త్రాగించవలెను.

లేక

పిప్పళ్ళు 4 తు, మిరియాలు 2 తు, దిరిశెనాకుపసరు సేరు, కలిపి పెట్టవలెను.

లేక

తెల్లతుమ్మచెక్కరసము రెండుసేర్లు, వెల్లుల్లిపాయలు అర్ధసేరునవటాకు, పసుపు 2 తు, ఉప్పు 6 తు, కలిపి కాచి మేకమూత్రముతో పెట్టిన తగ్గును.

—♦ వాపులకు ♦—

ఆవాలపిండి వెల్లుల్లిపాయలు వేడినీటిచే చిక్కగా కలిపి దట్టమైనగుడ్డగాని కాగితముమీదగాని సూక్ష్మముగా పూయ

వలెను. తరువాత ఆవాపుమీాద పట్టీవేసి పైన ఒక కంబళి గుడ్డనువేసి కట్టి అరగంటసేపుంచి తీసి తరువాత కొబ్బరినూనె రాచిన తగ్గవచ్చును.

లేక

నూరేకారము 2 తు, ఆముదము 8 తు, పొగాకు 1 తు, కర్పూరము 1 తు, కలిపి వాపునకు పట్టువేయుము.

## —♦ నెరడిదొమ్మ (Anthrax) ♦—

### స్వభావము (Distribution)

దీనినే ప్లీహజ్వర మందురు. ఈవ్యాధి మనదేశములో పాటుపడు పశువులకు తరచుగా వచ్చుచుండును. పశువు దేహములో నెరడిగుండె (Spleen) అను అవయవ మొకటి కలదు. ఇది కాలేయముకంటె పలుచగనుండి మిగుల నునుపుగనుండును. దీనిపైన తెల్లనిపొరగప్పబడి యుండును? ఇది పశువుకుడి డొక్కలో ఎడమవైపున నుండును. ఇదిమెత్తగానుండి స్పంజి వంటి పదార్థముతో చేయుబడియుండును. పశువునకు యెక్కువ మత్తుకలుగజేయుపదార్థములు పెట్టుటచేతను, ఎండయనక వానయనక పశువును విరామములేక పనిచేయించుట చేతను ప్రతిదినము చలిగాలిలో కట్టుటచెతను, మలపదార్థము పేరిగులలో చిక్కుకొనుటచేతను పశువు ఎల్లప్పుడు దీర్ఘశ్వాసముతీసు కొనుట చేతను, చాలకాలమునుండి నిలువయున్న వాములలోని గడ్డి మేపుట చేతను ఈవ్యాధివచ్చును. ఈవ్యాధి 24 గంటలు మొదలు 7,10, 30 దినములవర కుండును.

—♦ లక్షణములు (Symptoms) ♦—

ఆరంభములో నల్లకవ్వు వేయును? నెఱడిగుండె కొద్దిగా వాచును. ఈగుండె వాచినకొలది అరమేత మేయును. అర్థ నెమరువేయును. సరిగా నీరు త్రాగదు. నెఱడివాపు హెచ్చిన కొలది పశువు శుష్కించి పాలిపోవును. బరిఎముక లుబ్బును. ఎదరములు సరిగా కొట్టుకొన జాలవు. ముక్కుచుండును. కడుపులో ఒక విధమైన నొప్పియుండి అప్పుడప్పుడు మూల్గు చుండును. ఇంకను అప్పుడప్పుడు వెన్ను విరుచుకొనుచుండును. గట్టిగా రాయివలె పేడవేయును. క్రమేణ మేత నీరు మానును. నోటివెంట చొంగ అప్పుడప్పుడు పడుచుండును. క్రిమేపి పశువు రొమ్మున కడ్డముగా ఈగుండె తిరిగి ఊపిరాడకపోయి నందువలన పశువు చనిపోవును.

—♦ ఆయుర్వేదచికిత్స (Native Treatment) ♦—

ఈ వ్యాధి సంభవించిన పశువును అనుభవముగల పశు వైద్యునకు చూపించవలెను. దీనిని అందరు కనుగొనుటకష్టము. ఈ వ్యాధికి ఆరంభమునుండి చికిత్సచేయనిచో తరువాత కుదరదు. జీర్ణమును కలుగజేయు ఆహారమును పెట్టవలెను. చలి గాలిలోను, ఎండలోను పశువును కట్టరాదు.

—♦ ఆరంభించినవెంటనే ♦—

మోదుగపువ్వు 4 తు, జొన్నకలి సేరు, కలిపి ఉదయ సాయంకాలములందు పోయవలెను.

లేక

దిరిసెనచెక్కరసము సేరు, తురకవేపఆకు గుప్పెడు, నేలవేముపొడి 5 తు, బ్రిహ్మదండివేళ్లు గుప్పెడు కలిపిత్రొక్కి త్రాగించవలెను. నాలుగుదినములు పెట్టవలెను.

లేక

వెదురాకు 2 గుప్పెళ్లు, నేలవేము 2 తు, సొంటి 1 తు, పిప్పలిమోడి 2 తు, దిరిసెనపువేళ్ళపొడి 2 తు, పిప్పళ్లు 2 తు, మిరియాలు 1 తు, వాయింటచెట్టు సమూలం. ఈ వస్తువులు పొడిచేసి కలిపి కాచి పూటకు మూడుగొట్టములు త్రాగించవలెను. ఇట్లు వారముదినములు చేయవలెను.

లేక

దిరిసెనచెక్కరసము 10 తు, ఆవుపాలు సేరు, కలినీరు సేరు కలిపి దినమున కొకసారివంతున వారముదినములు త్రాగించవలెను.

లేక

నల్లఉప్పువేరుపొట్టు ఉడకబెట్టి నిమ్మకాయంత ఉండలు చేసి పెట్టవలెను.

ష రా:—ఇంకను చికిత్సలు కావలెనని కోరికయున్న యెడల నేను రచించిన "పశుచికిత్సాసారములో" చూడుడు.

పైన చికిత్సలకు లొంగనియెడల రాక్షసవైద్యమను గ్రంథములో చూచి రక్షలు వేయవలెను.

## —♦ నీరుదొమ్మ (Anthrax) ♦—

### —♦ స్వభావము (Distribution) ♦—

దీనినే రక్తము విరుగుటయందురు. ఇదివరకు చెప్పబడిన దొమ్మలలో నిదియొక ప్రాణాపాయమైన దొమ్మవ్యాధి. చలి గాలిఎక్కువగా సోకుటవలనను, రక్తములో జలభాగమెక్కువగా నిలువయుండుట వలనను, ప్రత్యేకముగా రక్తములోనే ఈవిషసంబంధమైన పురుగు లుండుటవలనను, చాలినంత మేత చాలినంత సూర్యరశ్మి లేకపోవుటవలనను, పశువును మితిలేని పనిచేయించుచుండుటవలనను నది మిగుల విచారము నొందుట వలనను ఈవ్యాధికలుగును.

### —♦ లక్షణములు (Symptoms) ♦—

ఆరంభములోపశువుశరీరము సమశీతోష్ణముగానుండును. మలబద్ధక మేర్పడును. శరీరముయొక్క కాంతి తగ్గి పశువు నల్లకప్పువేయును. మూత్రపురంగు తెలుపుగా నుండును. వేడి తగ్గుచుండును. ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములయందు ఆయాస మేర్ప డును. అన్నిలక్షణములకంటె ముఖ్యముగా ఈవ్యాధిప్రారం భించినది లగాయతు నోటినుండి అపరిమితమైన చొంగ భూమి మీాద పడి ద్రవరూపముగా వెడలుచుండును. రక్తమంతయు విరిగి నీటిరూపమున వెడలుచుండును. ఈసమయమందు చెవులు వ్రేలాడవేయును. కనుగుడ్లు బయటకు వచ్చును. ముఖకాంతి తగ్గును. స్మారకము తప్పి పశువు వెంటనే చనిపోవును.

## —♦ ఆయుర్వేదచికిత్స (Native Treatment) ♦—

ఈవ్యాధి ప్రారంభమైనవెంటనే వేడిని కలుగజేయు వస్తువులు పెట్టుట మంచిది.

సారాయి 3 డ్రాములు ఒకేసారి త్రాగించవలెను.

లేక

సారాయి 2 డ్రాములు; దుష్టుపాకుపసరు అర్ధసేరు; మిరెపకాయలపొడి 2½ తు; కలిపి త్రాగించవలెను.

లేక

వెల్లుల్లిపాయలు 2 తు; వాము అరసోలెడు; వాయింటాకు గుప్పెడు; కొట్టుపసుపు 2 తు; వస 1 తులము, తెచ్చి నూరి సేరు కారపుపాలలో కలిపి త్రాగించవలెను.

లేక

చేదుజీలకఱ్ఱ 4 తు; మిరియాలు 3 తు; వేపాకు పిడికెడు; పసుపు 2 తులములు; కుప్పెంటిఆకుపిడికెడుకలిపి ఉండలు చేసి పెట్టవలెను.

## —♦ హెచ్చరిక (Prevention) ♦—

ఈవ్యాధిగల పశువుదగ్గరగ యేపశువుల నుంచరాదు. నోటినుండి ద్రవరూపముగపడిన చోంగపై మన్నుగాని బూడిదగాని వేయవలెను. ఆస్థలము శుభ్రముగా తుడిచి ఫినైల్ చల్లవలెను.

## —♦ నాలిదొమ్మ (Anthrax) ♦—

### —♦ స్వభావము (Distribution) ♦—

ఇదియొకరకము దొమ్మ. పశువులకు చలిగాలి తరచుగా సోకుటచేతను, ఎండయనక వానయనక రాత్రింబవళ్లు చిక్కిన పశువులను బండ్లుకట్టి తోలుటచేతను, పశువున కెప్పుడు మలబద్ధకముండుటచేతను, నీటితుంగ, తూటుకూర మొదలగునవి తినుటచేతను ఈ వ్యాధి పశువులకు సంభవించును. ఈ వ్యాధి ఎక్కువగా బలముగల పశువులకును లేతపశువులకును వచ్చును. ఈ వ్యాధిని జాగ్రత్తగా కనిపెట్టవలెను. దీనిని కనిపెట్టలేక శిరోవాతమనియు, కొమ్ముమడొల్లలనియు చెప్పుదురు. ఈ దిగువ లక్షణములు తెలిసికొని తగినవ్యాధిని నిర్ణయించ కోరుతాను. దొమ్మలో నాలిగానుండుటవలన నాలిదొమ్మయని పేరు వచ్చినది.

### —♦ లక్షణములు (Symptoms) ♦—

మొదటి దినమున తీవ్రమైన జ్వరముండి, తరువాత తగ్గును. కండ్లనుండి నీరుగార్చును దగ్గును. నల్లకష్ఠ వేయును. మొదటి దినము మేతమానును. నీరంతగా త్రాగదు. నోరు కొంచెము వాసనగానుండును. మరికొంతటికి యుండదు. ఇట్లు వారముదినములవరకుండును. నోటినుండి, ముక్కుల గుండ ద్రవపదార్థము కొద్దికొద్దిగ పడుచుండును పశువు మందమతిగానుండి తలనూపుచు నానాటికి కృశించును. పలుచగా పాఱుచుండును. ఆ పారుడులో దుర్గంధమైన వాసనయుండని

ఈ వ్యాధి ముదిరినకొలది చొంగ ఎక్కువగా పడుచుండును. అపానవాయువులు తరచుగా విడచుచుండును. వేడితగ్గును. కండ్లు ఎరుపురంగుగా కొన్నిటికి యుండును. పశువు బలహీనముచే పండుకొని లేవలేదు. కన్నులు లోపలికిపోవును. నాలుక జారవిడుచును. ఆయాసముపుట్టి నేలబడితన్నుకొని చచ్చును. ఈ వ్యాధి తొమ్మిది లేక 12 దినముల వరకుండును.

—♦ చికిత్స ♦—

ధనియాలు సోలెడు, జీలకఱ్ఱ 4 తు, నిమ్మఉప్పు 2 తు, కలకండ 2 తు, నేలవేము 4 తు, పొడిజేసి రెండుసేర్ల నీటిలో వేసి కషాయముగా కాచి త్రాగించవలెను.

లేక

తాడికాయలు 2 తు, ఉసరికపప్పు 2 తు, కరక్కాయలు 1 తు, సొంటి 1 తు, పిప్పళ్లు 1 తు, మిరియాలు 1 తు, చింతపండుపులుసు అర్ధసేరు, గేదెపేడరసము అర్ధసేరు, కలిపి కాచి త్రాగించవలెను.

లేక

మండపసుపుకొమ్ములు 2 తు, ఉసరికపప్పు 2 తు, వెల్లుల్లిపాయలు 2 తు, శొంటి 2 తు, పిప్పళ్లు 2 తు, ఎండుమిర్చి పొడి 4 తు, మిరియాలు 2 తు, ఉలవపిండి తవ్వెడు, త్రొక్కి ఉండలుచేసి దినమునకు రెండు ఉండలువంతున మూడు దినములు పెట్టినతరువాత అర్ధసేరు మునగచెక్కరసము త్రాగించవలెను. కాచిన నీటిని త్రాగించవలెను. రక్షలు వేయవలె

నని కుతూహలము ఉన్నయెడల రాక్షసవైద్యమను గ్రంథ ములో చూడుము.

## —♦ చలిదొమ్మ (Anthrax) ♦—

### —♦ స్వభావము - వ్యాపకము (Distribution) ♦—

ఈ వ్యాధి తొలకరివర్షములు కురిసినతరువాత ఆరంభించును. ఈ వ్యాధి ఎక్కువగా పల్లపునేలలయందును, బురద నేలలయందును ప్రబలును. దోమలు మిక్కుటముగా కుట్టుట వలనను మురికినీరు త్రాగుటవలనను విషసంబంధమైన వాయువులను పీల్చుటవలనను వ్యాధి ఎక్కువగా రావచ్చును. ఈవ్యాధిని కలిగించు సూక్ష్మజీవులు, సూర్యోదయమునకు పూర్వమును, సూర్యాస్తమయమునకు తర్వాతను ప్రబలియుండును. ఏకారణము వల్లనైనను పశువుశరీరమునందు గలిగెడి జీవసత్వము యొక్క తగ్గుదలస్థితియందు ఈ వ్యాధి సంబంధమగు సూక్ష్మజీవులు శరీరమునందు ప్రవేశించును. అట్లు జీవసత్వము తగ్గుట వలన అట్టి జీవులయొక్క నివాసమునకును, అభివృద్ధికిని మూల కారణమగుచున్నది.

### —♦ లక్షణములు (Symptoms) ♦—

పశువునకు ఆరంభములో 106, 107 డిగ్రీలజ్వరముండి అపరిమితమైన చలిచే బాధపడుచు గజ గజ వణకుచుండును. వెన్ను, కాళ్లు, మొదలగు భాగములు అస్వస్థత నొంది యుండును. చెవులలో యొకవిధమైన ధ్వనిపుట్టును. నాలుక తెల్లగాయుండును. చలిచే ముఖకాంతి తగ్గును. పశువు నల్లకప్పు

వేయును. ఎదరములు త్వరితగతిని కొట్టుకొనుచుండును. చలిచే పండ్లు కొరుకును. మూత్రము వెడలునపుడు మంటపుట్టును. క్రమేణ కడు పుబ్బుచుండును. ఒక విధమైన బుస పెట్టును. వ్యాధి ముదిరినకొలది నోటివెంట చొంగ ఎక్కువగా పడును. నాలుక జారవేయును. ఉఛ్వాస నిశ్వాసములు అడుట కష్టముగా నుండును. పలుచగాపారును. క్రమేణ కండ్లు గిరగిర త్రిప్పి నేలబడి మరణించును.

—♦ చికిత్స (Native Treatment) ♦—

సారాయి 1 బుడ్డీ, దుష్టుపాకుపసరు అర్ధసేరు, కలిపి ఒక్కసారి త్రాగించవలెను.

లేక

కారపుపాలు సేరు, శొంఠిపొడి 2 తు, పిప్పళ్ళపొడి 2 తు, మిరియాలపొడి 2 తు కలిపి ఒకసారి త్రాగించవలెను.

లేక

స్త్రీలమూత్రము అర్ధసేరు, ఆవుపంచితము అర్ధసేరు, కలిపి త్రాగించవలెను.

లేక

కొబ్బరిపిండి సోలెడు, ఆవుపంచితము అర్ధసేరు, కలిపి ఒక సారి త్రాగించవలెను.

లేక

సున్నపుతేట సేరు ఒకసారి త్రాగించవలెను.

లేక

కరిదూపము పిడికెడు, సున్నము 2 తు, వేడినీరు అర్ధ నేరు, కలిపి ఒకసారి త్రాగించవలెను.

పైనచెప్పిన చికిత్సలకు లొంగనియెడల రాక్షసవైద్య మను గ్రంథముచూడుము.

—♦ ఆంగ్లేయచికిత్స (Allopathic Treatment) ♦—

దొమ్మ, గుండెదొమ్మ, నీరుదొమ్మలకు దిగువచికిత్సలు చేయవచ్చును.

కార్బాలిక్ ఆసిడ్ ⅛ తులము; వరిగంజి సేరు కలిపి ఒకపర్యాయము త్రాగించుము.

లేక

ఫినైల్ ½ తులము; వరిగంజి సేరు; కలిపి త్రాగించ వలెను.

లిన్‌సీడ్‌ఆయిల్ 50 తులములు; టర్పెంటైన్ 2½ తుల ములు కలిపి త్రాగించవలెను.

దొ మ్మ వ్యా ధు ల క న్ని టి కి

—♦ సారూప్యచికిత్స (Homoeopathic Treatment) ♦—

ఆరంభములోనే అమ్మోనియం కాస్టికంను అకోనిటం నాప్ 10 చుక్కలును ప్రతి అరగంటకు- పావుగంటకు ఈయ వలెను.

పై మందు లిచ్చినతరువాత గుణము కనుపడినయెడల బెల్డోనాను అకోనిటం 10 చుక్కలను ప్రతిగంటకు ఈయవలెను.

కుంటుచు మిగుల బలహీనముగా నున్నయెడల బ్రెఆల్బమ్‌ను అక్లోనైటు లేక ఆర్సెనికం ఆల్బంను ప్రతి అరగంటకు ఈయవలెను.

మిగుల బలహీనముగా నున్నపుడు ఆర్సెనికం ఆల్బంను బ్రెఅల్బ్ంతో కలిపి ఈయవలెను.

అక్కడక్కడ వాపులున్నయెడల వేడినీటి కాపులుతీసి ఆర్సెనికం లోషనుతో శుభ్రముచేయవలెను. నోటిని చన్నీటిచే కడుగుచుండవలెను.

## కాలికుంటు

## (Foot and Mouth Disease)

కాలికుంటు. కాలిగాళ్లు, నోటిగాళ్లు, కాలినోటిగాళ్లని చెప్పుదురు.

### స్వభావము, వ్యాపకము (Distribution)

ఇది తీవ్రమైన అంటువ్యాధి. ఈ రోగము దేశమంతట అప్పుడప్పుడు శీతోష్ణస్థితిగతుల ననుసరించి వ్యాపించుచుండును. ఇంక నీవ్యాధి పందులకు, గొర్రెలకు, మేకలకు కూడా వచ్చును. ఇది బహు వేగముగా వ్యాపించెడి వ్యాధి. ఈజాడ్యమును కలుగజేయు విషజీవులు పశువులరక్తములోను, బొబ్బలలోను నుండును. ఒకజాతి పశువులనుండి మరొకజాతి జంతువులకుకూడ సోకును. ఈజాడ్యసంబంధమగు విషము, మేత, నీరు, గాలిమూలమున దేహములో ప్రవేశించి 4 దినములు దాగియుండి 5 వ నాడుగాని లేక ఆరవనాడుగాని బయట

కుబుకును. ఒకసారి జాడ్యము తగిలిన తరువాత సుమారు 9 మాసములవరకు మరల ఆజాడ్యము రాజాలదు. ఒకవేళ వచ్చినను తేలికగా నుండును. ఈవ్యాధి కొన్నిటికి నోటికిని, మరికొన్నిటికి పాదములకు రావచ్చును. లేదా నోటికి ముందుగా పోకి తరువాత పాదములకు రావచ్చును. కాని ఈవ్యాధిపశువును చంపకపోయినను రైతుయొక్క పనికిమాత్రము అడ్డము వచ్చును. చదునుప్రదేశములలో నుండు పశువులకంటెకొండల మీాదనుండు పశువులకు ఈవ్యాధి యెక్కువగాపోకును. ఇంకను పశువులకొట్టములు, రైలువాగెనులు, గాడితొట్లు మున్నగునవి కూడ ఈవ్యాధి వ్యాపించుటకు ఆధారము లైయున్నవి. గొఱ్ఱె పిల్లలకు, కుక్కలకు, దూడలకు, పందిపిల్లలకుకూడ తమ తల్లుల పాలనుంచి ఈవ్యాధి వాటికి రావచ్చును. కోళ్ళకుకూడ రావచ్చును.

ఈవ్యాధితగిలిన పశువులతో పనిచేయించరాదు. అట్లు చేయించినచో కాళ్ళయొక్క గొరిజ లూడిపోయి పనికిమాలిన దగును. జాడ్యముతగిలిన పశువునుండి మంచి పశువునకు వ్యాపించును. మేత నీరు గాలి మూలమునను రోగపశువుదగ్గర పనిచేయు పరిచారకుల మూలమునను పాలుపితికెడువారి మూలమునను కుక్కలు పిల్లులు కోళ్ళు ఎలుకలు పక్షులు ఈగలు మొదలగువాని మూలమునను రోగపశువులను సంతలకు తోలుకొని వచ్చుట మూలమునను ఈవ్యాధి వ్యాపించుచున్నది.

—♦ లక్షణములు (Symptoms) ♦—

పశువునకు ఆరంభములో 106, 107 డిగ్రీలజ్వరముం

డును. మూతిచెమ్మ లేకయుండును, నల్లకప్పు వేయును. నోటి నుండి నురుగుకట్టిన చొంగకారును. కాళ్లు చెవులు వేడిగా నుండును. అరమేత మేయును. రొంచెము మలబద్ధక ముండును. పశువు పెదవులతో చప్పరించుచుండును. నోటిలోని చర్మపుపొర ఎఱ్ఱగాకందియుండును. నాలుకమీదను నోటిలోపలను దవడల లోపలి భాగములందును ముక్కులలోను గిట్టలసందునను కండ్లలోను కొమ్ములలోను పాడిపశువులపొదుగులమీదను చిన్న చిన్న బొబ్బలు కనబడును. ఇవి బఠానీగింజలంత పరిమాణమై చితికి రసికారును. కాళ్ళ డెక్కలమధ్య ఈపుండ్లు రెండు మూడుకలసి అట్టకట్టుకొనిపోవును. వీటిని శుభ్రము చేయనిచో పురుగులుపడి దుర్వాసనవేసి డెక్క లూడిపోవును. ఇదివరకు చెప్పిన అవయవములమీద లేచెడిబొబ్బలు చితికిన తర్వాత జ్వరముతగ్గును. కొన్నిపశువులకు కొమ్ములచుట్టును బొబ్బలులేచి రెండు మూడుకలసి అతుకుకొనిపోవును. కొమ్ములను శుభ్రముచేయనిచో కొమ్ములుకూడ ఊడిపోవును. పాడి పశువులకు యీ బొబ్బలు లేచుటవలన పాలు తగ్గిపోవును. రైతులు కండ్లలోను, ముక్కులలోను, నోటిలోను తదితర చోట్ల లేచెడి బొబ్బలవిషయమై తగు జాగ్రత్త తీసికొననిచో అచ్చట పురుగులుపడి పశువులకు ప్రాణాపాయముకూడ సంభవించును.

## హెచ్చరిక (Prevention)

జాడ్యముతగిలినపశువును ఎండలో నుంచరాదు. ఈ వ్యాధికికూడ సంరక్షణచేయుటయే ముఖ్యమగు చికిత్స. ఈ

వ్యాధిసోకినపశువులను, వాని చుట్టుప్రక్కలనుండెడి ప్రదేశములను శుభ్రము చేయుటయును, వానికి పరిపూర్ణమైన విశ్రాంతి నిచ్చుటయు ముఖ్యాంశములై యున్నవి. పశువుల కొట్టములు అశుభ్రముగా నున్నచో అచ్చట పాడిమట్టిగాని, కంకరవగైరాలుగాని, పాడిఇసుకగాని వేసి బాగుచేసి పశువుల నుంచవలెను. ప్రతిదినము కార్బాలిక్ లోషనుతోగాని, ఫినైల్ లోషనుతోగాని పశువులకొట్టములలో జల్లిన క్రిములు హరించును. పాలిచ్చుపశువులను లేగదూడలను బలహీనమైన పశువులను ముసలిపశువులను జాగ్రత్తగాచూచి వాటివాటికిప్రత్యేకముగా చికిత్స చేయుచుండవలెను. జబ్బుతగిలిన పాడిపశువుల దగ్గరలేగలను పాలుకుడుపక వాటికి ప్రత్యేకముగా పోయవలెను. కొండల మీాదనుండెడి పశువులకును, ఇతర దేశములనుండి తెప్పించెడిపశువులకును, బహుతీవ్రముగా యీావ్యాధి సోకును. గాన వానికి జాగ్రత్తగా చికిత్స చేయవలెను. ఈజాడ్యము తగిలిన పశువులను కొందరురైతులు బురదలో దింపుదురు. మరికొందరు పాడిమట్టిని చల్లుదురు. ఇది డబ్బుఖర్చు అగునను తలంపుతో చికిత్సచేయుటయేగాని, మరొక్కటికాదు. చలికాలములో ఈచికిత్స చేయుటవలన ఆడెక్కలు బురదతో బిగిసిపోయి పెద్దపుండ్లయి పశువున కపాయము తటస్థించును.

## —• ఆయుర్వేదచికిత్స ( Native Treatment) •—

ఆరంభములో నూరేకారము 2 తు, వేడినీరు అర్ధసేరు, కలిపి త్రాగించవలెను.

లేక

యూకలిప్టస్‌ఆయిల్ ½ తు, వేడినీరు అర్ధశ్శేరు కలిపి త్రాగించవలెను. అవసరమైనయెడల మరల పైమోతాదు ఒకటి రెండుసార్లు ఈయవచ్చును.

లేక

ఉప్పు 4 తు, నేలవేము 2½ తు, మంచిబెల్లము సవా శ్శేరు కలిపి నాకించవలెను.

లేక

పెసరపప్పు అర్ధసేరు, వేలపిండి సోలెడు, నూనె సవా సేరు కలిపిపెట్టవలెను.

లేక

తమిదెజావ అర్ధసేరు, మంచినూనె సవాసేరు కలిపి త్రాగించవలెను.

లేక

నీరుల్లిపాయలు 6 తులములు, పెసరపప్పు అరసోలెడు, జొన్నఅన్నము అర్ధసేరు, పసుపు 2 తు, కలిపి పెట్టవలెను.

—♦ నోటిపుండ్లకు ♦—

పటికపొడినిగాని, మాచికాయపొడినిగాని, కాచుపొడి నిగాని వేడినీటిలో కలిపి అప్పుడప్పుడు నోటికి కొట్టుచుండ వలెను.

—♦ కాలిపుండ్లకు ♦—

తుమ్మచెక్క, రావిచెక్క తెచ్చి నీటిలోవేసి సలసల కాగనిచ్చి గోరువెచ్చగా నుండువరకు ఆరబెట్టిన తరువాత

ఆనీటితో పుండ్లను ఉదయ సాయంకాలములందు కడుగుచు పుండ్లకు పేరినెయ్యిగాని, ఆముదము పసుపు కలిపిగాని రాచిన తగ్గును.

లేక

తుమ్మచెక్కపొడి 10 తు, వేపచెక్కపొడి 10 తు, కర్పూరము 1 తు, కలిపి పుండ్లకు పట్టించిన తగ్గును.

లేక

కరక్కాయపొడి 2 తు, కాచుపొడి 2 తు, కొబ్బరి నూనె 8 తు, కలిపి పుండ్లకు రాయుచుండుము.

ఈగలు ముసురుచున్న యెడల వేపనూనెగాని, ఫినైల్ గాని అప్పుడప్పుడు రాయుచుండవలెను.

## —♦ పురుగులు పండిన పుండ్లకు ♦—

గాడిదగడపాకు గుప్పెడు; మిరియాలు అర తు; సైంధవ లవణము 1 తు నూరి కట్టవలెను.

లేక

కొత్తసున్నము 1 తు, సీతాఫలపాకు గుప్పెడు, వస ½ తు నూరి కట్టవలెను.

## —♦ పథ్యము (Prevention) ♦—

నోటిలోను కాళ్ళలోనుండు పుండ్లకు ఈగెలు వ్రాలి పురుగులు పట్టును. కాబట్టి ఈగలు వ్రాలకుండ చూచుట మంచిది. నోటిలోని పుండ్లవలన పశువు మేతమేయక క్రమముగా కృశించును. కాబట్టి బలము తగ్గకుండుటకు మెత్తని

పచ్చిగడ్డి వేయవలెను. ఆగడ్డి తిననియెడల బియ్యపునూకల గంజి కాచి దానిలో ఉప్పువేసి త్రాగించవలెను. అట్లు త్రాగని యెడల కొంచెము లోపలికి గొట్టముతో పోయవలెను. పశువైద్యులు చాలమంది మడ్డికూడు పెట్టుదురు. ఇది చాలా మంచిపద్ధతి. పచ్చజొన్నలు కుంచెడు, మంచినువ్వులనూనె అర వీసెడు తెచ్చి జొన్నలు తోపగావండి దానిని ఈనూనెలో కలిపి ముద్దలుచేసి వారముదినములు లేక పక్షముదినములు గాని పెట్టిన పశువునకు దండిగానుండును. మిగుల బలముకూడ గలుగజేయును.

ఒకటిరెండు పశువులకు వ్యాధితగిలిన వెంటనే వ్యాధి తగలని పశువులకుగూడ ఈదిగువ నుదహరించు చికిత్స చేయవలెను. అట్లుచేసిన వ్యాధిలేనిపశువులకు వ్యాధిరాకుండ జేయును. వ్యాధిగ్రస్తమైనపశువులకు వ్యాధినివారణమగును. ఆవుమజ్జిగ అర్ధసేరు, మంచినూనె నవటాకు తెచ్చి సోలెడు లేక అరసోలెడు బియ్యపు అన్నములోగాని ఆరిగ అన్నములోగాని కలిపి రెండు గొట్టములు పోసిన శాంతించును.

—♦ ఆంగ్లేయచికిత్స (Allopathic Treatment) ♦—

పొటాస్‌నైట్రిస్ 2 తు; కామన్‌సాల్టు 2 తు; బైకేటా 2 తులములు కలిపి నూకలగంజిలోగాని మంచిబెల్లపునీటిలో గాని కలిపి త్రాగించవలెను.

లేక

యూకలిప్టస్‌ఆయిల్ ½ తు; వేడినీరు సేరు; కలిపి త్రాగించవలెను.

లేక

పొటాస్‌నైట్రిస్ 2 తు; మాగ్సల్ఫు ½ పౌను; వేడి నీరు సేరు కలిపి త్రాగించవలెను.

## — నోటిలోని పుండ్లకు —

ఆలం లోషన్‌గాని పొటాషియం పర్మాంగనేట్ లోషన్‌గాని బోరిక్ ఆసిడ్‌లోషన్‌గాని అప్పుడప్పుడు వాడవలెను.

లేక

పొటాస్‌క్లోరస్‌తో తగినంత తేనెగాని బెల్లముగాని కలిపి అప్పుడప్పుడు నోటిపుండ్లకు రాయవలెను.

## — కాలిపుండ్లకు —

కాపర్ సల్ఫేటు లోషను వాడవలెను లేక ఫినైలు లోషను వాడవలెను. లేక జింకుక్లోరేడ్ లోషను వాడవచును.

జింకుఆక్సైడ్ 2 భాగములు, బోరిక్ ఆసిడ్ 2 భాగములు, ఆయిడోఫారం $\frac{1}{20}$ భాగము కొబ్బరినూనె 8 భాగములు కలిపి కాలిపుండ్లకు, చర్మముమీద, కొమ్ముల చుట్టునుండు పుండ్లకు ఈమందును అప్పుడప్పుడు రాయుచుండవలెను.

ఈగలబాధ ఎక్కువగానున్నచో సీమ్ ఆయిల్‌గాని ఫినైల్‌గాని, కిరసినాయిల్‌గాని, మంచినూనెగాని వాడవలెను.

పురుగులుపడిన పుండ్లలోనే ఫినైలు వేసిన పురుగులు చచ్చును. అన్నిపుండ్లకు అనగా పురుగులు లేని పుండ్లకు

ఈఫినైలును వాడరాదు. అట్లువాడిన పశువు పుండుపెద్దదై నెమ్మదించక జ్వరమువచ్చును. పుండ్లకు కార్బాలిక్ ఆయిల్‌ను ఉపయోగించిన తగ్గును.

—♦ సారూప్యచికిత్స (Homoeopathic Treatment) ♦—

గాలికుంటులో ఆర్సెనికం, బెల్డోనా, మెర్క్యూరియస్ మందులు వాడుట మంచిది.

పశువు మందమతిగా నున్నపుడు మేత మేయునపుడు చర్మముముడుచుకొనినపుడు కొద్దినీటిలో ఆర్సెనికంనుకలిపి 3 గంటలకొకసారి 2 గ్రెయినులవంతున ఈయవలెను.

కన్నులు మసకగానుండి నీరు కారుచున్నపుడు పొదుగు వాపుజెంది వేడిగానున్నపుడు గిట్టలుపగిలి మంటగానున్నపుడు ఆర్సెనికంవలెనే బెల్డోనానుకూడ వాడవలెను. గిట్టలుపగిలి నోటిలోను గిట్టలలోను పొక్కులు చితికినపుడు నోటినుండి ముక్కులనుండి నీరుగారునపుడు 2 గ్రెయినుల మెర్క్యూరియస్‌ను 4 గంటల కొకసారి వాడవలెను.

—♦ పథ్యము - హెచ్చరిక (Prevention) ♦—

జంతువును విశ్రాంతియైన పరిశుభ్రమైన శాలలోనుంచి, మెత్తని ఆహారము యితర జావలు యిచ్చుచుండవలెను. నోటిని • వేడినీటితో కడుగుచుండవలెను. పొదుగులోనిపాలను పిండుచుండవలెను.

ఈరోగ మంతతీవ్రముగా తగులక తేలికగా సోకి తదితర దుర్లక్షణములేవియు లేనప్పుడు 9 దినములు మొదలు

20 దినములలోగా పశువు బాగుపడును. ఈజ్వరము తీవ్రముగా తగులక తేలికగా తగిలిన పశువులను సరిగా చూడక పోవుటచే కొమ్ములలోను డెక్కలలోను పురుగులుపట్టి పశువు నీరసించును. ఆడపశువైనచో పొదుగు మొదలగునవి వాచి చాలకాలమువరకు బాధించి తుదకు మరణము సంభవించును.

పాలిచ్చెడి పాడిపశువులు ఎండిపోవుట; చూడిపశువులు ఈచుకొనిపోవుట; మంచి పశువులకు కసిమిరి తగులుట; పాటుపడు పశువులు కృశించి పనిపాటుల కక్కరకు రాకుండుట; కొన్ని పశువులకు జీవితకాల మంతయు కాళ్లకు, పాదములకు జబ్బులు కలుగుట మొదలగు పలువిధములైన నష్టములు ఈ జాడ్యములవలన కలుగుచున్నవి. కాబట్టి రైతులు ఈవ్యాధి ప్రారంభించిన వెంటనే తగినశ్రద్ధ పుచ్చుకొనవలెను.

మనుష్యశరీరముమీద నుండెడి గాయములు కురుపులు మొదలగువాని మూలమున గాళ్లు' తగిలిన పశువుచొంగ ప్రవేశించి మనుష్యులకుకూడ నీవ్యాధి సోకును. ఇంకను వాటిపాలను మనుష్యులు త్రాగుటచేతగూడ ఈవ్యాధి రావచ్చును. జాడ్యము తగిలిన పశువుపాలు చంటిపిల్లల కెంతమాత్రము వాడరాదు. అట్లు వాడిన పిల్లలకు కూడా ఈవ్యాధి తప్పక సంభవించును. ఈ జాడ్యముచే చనిపోయిన పశువుమాంసము తినరాదు. గాళ్లుతగిలి నెమ్మదించిన రెండు లేక ఆరునెలలకు కాళ్ళడెక్కలలో నల్లకప్పువేసి ఒకవిధమైన మురికితోగూడిన నలుపుపదార్థము కూడియుండును. అందువలన పశువు కుంటుచుండును. అప్పుడు మంచి పదునుగల

కత్తితో డెక్కలు కోసివేసి తవుదు ఉడికించి గీసిన డెక్క భాగములకు రెండుకట్లు కట్టవలెను.

## — గూడవాపు (Black quarter) —

దీనినే జబ్బవాపందురు.

## — స్వభావము - వ్యాపకము (Distribution) —

ఇదియును ఒకవిధమైన అంటువ్యాధియే. ఈ వ్యాధిని కలిగించు సూక్ష్మజీవులు నీరునిలిచి బురదగానుండు పల్లపు ప్రదేశములలో నుండును. అట్టి ప్రదేశములలో మొలచుగడ్డిని మేయుటవలన ఈ రోగము శరీరములో ప్రవేశించును. కావున ఈవ్యాధి తరచుగా వర్షాకాలములో ఆరంభమై శీతాకాలమువరకుండును. అనగా శ్రావణమాసము లగాయతుమార్గశిరమాస మధ్యవరకు వచ్చుచుండును. ఈ వ్యాధి లేతవయస్సులోనున్న పశువులకు అనగా 4 నెలల నుండి 5 సంవత్సరములవరకు వయస్సుగల పశువులకు మాత్రమే విస్తారముగా సోకును. ఈ వ్యాధి కొన్నిపశువులకు పై కుబకక లోపల దాగియుండును. కండబట్టి మిగులబలిసియున్న గిత్తలకు తరచుగా నీవ్యాధి సోకుచుండును. లేగదూడలకు మాత్ర మీ వ్యాధిసోకదు. వేసవికాలములో సరియైన మేతలేక తొలకరించగనే మిక్కిలి ఆతురతతో పచ్చికతిను పశువులకు గూడా ఈవ్యాధి సోకును. ఎద్దులకు ఈవ్యాధిసోకిన నెమ్మదించుట కష్టము. ఇది ఒంటెలకు గొర్రెలకు మేకలకుగూడ తగులును. దీనిని కలిగించు సూక్ష్మజీవి కాళ్లకుండు పాత గాయములమూలమునను తదితరకురుపులమూలముననుకూడ

ప్రవేశించి ఈ వ్యాధి సోకవచ్చును. ఈవ్యాధితగిలి నెమ్మదించిన పశువులకు మరలరాదు. ఇది పశువునకు సోకిన రెండు దినములవరకు దాగియుండి తరువాత బయటకు కనపడును.

## —♦ లక్షణములు (Symptoms) ♦—

ఈవ్యాధి తగిలిన పశువు మిగిలిన వానితోనుండక ప్రత్యేకస్థల మందుండును. పశువు మేతమేయక మందముగా నుండును. నడచునప్పుడు కొంచముకుంటును. జాగ్రత్తగా చూచినచో ముందుజబ్బమీదగాని, వెనుకతొడమీదగాని ఇంకనుశరీరమం దేభాగమందైనగాని కొంచము వాపుపుట్టును. ఆవాపు ఎక్కువ వేడిగానుండును. అది త్వరలోచుట్టును వృద్ధిపొంది పశువును కదలకుండునట్లు చేయును. మరికొంత సేపటికి ఆవాపు పైకిపొంగినట్లు స్పష్టముగా కనబడును. అప్పుడు ఆవాపు మీద చేతితో తట్టినయెడల బురబుర లాడును. వాచినప్రదేశముయొక్క చర్మముక్రింద గాలియున్నట్లు స్పష్టముగా కనబడును. అచ్చట కోసిచూచిన యెడల ఆమాంసము కుళ్ళియుండును. పులిసిన నురుగువంటి ద్రవము కారును. ఈవాపును బట్టియే గూడవాపు లేక జబ్బవాపు అనిపేరువచ్చినది. ఇంకనీవాపు శీఘ్రముగా పెరిగి 2 గంటలుమొదలు 24 గంటలలోగాని, రెండుమూడు రోజులలోగాని పశువును చంపును. ఈవ్యాధి యెక్కువైనకొలది పశువు మిగుల విచారముగా నుండును. పశువు వణకుచుండును. నీరుత్రాగదు. ఊపిరినడిగా విడుచుచుండును. జంతువు మూలుగును. క్రమేణ నీరసించి చనిపోవును.

### —♦ చచ్చినతరువాత కనబడు లక్షణములు ♦—
### (Post mortem Appearances)

చచ్చినవెంటనే పొట్ట బాగుగా నుబ్బును. ముక్కుల గుండ, నోటిగుండ, ఆసనముగుండ నెత్తురు చొంగ కలసి పడును. ఈ నెత్తురు నలుపురంగుగాగాని: గోధుమరంగుగాగాని యుండును. పశువు ఒకవిధమైన పులుసువాసనకొట్టును. రక్తము గడ్డకట్టియుండును.

### —♦ చికిత్స (Treatment) ♦—

వాచిన ప్రదేశమును కత్తితోకోసి కుళ్ళిన మాంసమును తీసివేసి కర్పూరతైలము రాయవలెను. లేక వాపు పైకి కనపడగానే జిల్లేడుపాలు ఆముదము సమానభాగములుగా కలిపి ఆ వాపుపైన రాచి సొరముల్లుచేగాని పేనాకత్తిచే గాని, ఆవాపు మధ్యగా చీల్చవలెను. చీల్చగనే చెడురక్తము నీరు కలిసి పడిపోవును. వెంటనే జిల్లేడాకు, దుష్టుపాకు పసరు సమానభాగములు తీసికొని దానిలో 2 తులములు రాతి తడి సున్నము కలిపి ఆవాపునకు రాయవలెను.

### —♦ ఆంగ్లేయ చికిత్స (Allopathic Treatment) ♦—

కార్బాలిక్ ఆసిడ్ ½ తు, వరిగంజి సేరు, కలిపిత్రాగించవలెను.

లేక

పొటాషియం అయోడైడ్ 4 డ్రాములు, నీరు సేరు, కలిపి త్రాగించవలెను.

### లేక

పర్మాంగనేట్ లోషన్ చిక్కగా కలిపిఇమ్మును. వాపులను శస్త్రముచేసిన తరువాత కార్బాలిక్ లోషనుతోగాని పర్మాంగనేట్ లోషనుతోగాని ఆభాగముకడిగి, సల్ఫర్ 1 భాగము, పొటాష్ బై కార్బనేట్ ¼ భా, జింకుఆక్సైడ్ ¼ భా, ఓలియంపీసెస్ 1 భా, క్రియోసోట్ ⅛ భా, కొబ్బరినూనె 8 భా, సబ్బు సొల్యూషన్ తగినంత కలిపి అప్పుడప్పుడు రాయుచుండవలెను.

## —♦ కంఠమాద (Hemorrhagic Septicamia) ♦—

దీనినే కుత్తుకవాపు కంఠమాద గురక గొంతురోగము అని పలువిధములుగా చెప్పుదురు. దీనినే దున్నలప్లేగందురు.

## —♦ స్వభావము - వ్యాపకము (Distribution) ♦—

ఇది రక్తసంబంధమైన రోగము. పశువులకు సంభవించు వ్యాధులన్నిటిలో నీ వ్యాధి తుపాకిగుండు వంటిది. ఈ వ్యాధి తగిలిన కొన్నిగంటలలోనే పశువు మరణించును. ఈ వ్యాధి గ్రామములో వ్యాపించిన దనగానే రైతులగుండెలు దడదడ కొట్టుకొనును. రైతున కింతయాందోళనకు కారణమేమన ఈవ్యాధికి సరియైనచికిత్స దొరకకపోవుట వలననేగాని మరొకటిగాదు. అనేక సంవత్సరములనుండి వెటరినరీ డాక్టర్లు ఆయుర్వేద పశువైద్యులు ఈవ్యాధికి తగిన చికిత్సలు కనుగొనుటకు ప్రయత్నములు చేయుచున్నారు. గాని యింతవరకును సరియైన చికిత్సలభించలేదు. ఈవ్యాధి గ్రామమునకు

వచ్చినదనగానే తమబండిఎడ్లకు గొంతుకవద్ద వాతలు వేయు యుదురు. ఈవ్యాధి పశువులకు సోకినయెడల ఈవాతలు కూడ పనిచేయవు. ఈవ్యాధిచే 100 కి 90 పశువులు నిరాటంకముగ మృతినొందును. ఇదియును అంటు జాడ్యములలోనొకటి. ఇది యొకవిధమైన సూక్ష్మజీవిచే కలుగుచున్నది. ఈవ్యాధి పక్షులకుగూడ సంభవించును. ఇది హిందూదేశమునందన్ని చోట్ల ప్రచారము చేయును. దీని సూక్ష్మజీవి పల్లముగను అనారోగ్యముగను తేమగను ఉండునట్టి పల్లపునేలలలో కన్పించును. అట్టి ప్రదేశములలో మొలచుగడ్డిలోగాని త్రాగునీటిలోగాని యుండి పశువుయొక్క శరీరములో ప్రవేశించును. ఈవ్యాధి ముఖ్యముగ దున్నలకు గేదెలకు గల్గును. అందువలన దీనిని దున్నలప్లేగని చెప్పుదురు. వర్షాకాల ప్రారంభములో అనగా తొలకరి ఆరంభించగనే ఈవ్యాధి కనుపడును. ఈవ్యాధి పశువులకుండు గాయముల మూలమునను పండ్లూడిపోయిన గాయముల మూలమునను, అపరిశుద్ధమైన దాణాదినుసుల మూలమునను, ఈగలుదోమలు మూలమునను కలుగును. పశువులోపల దాగియుండి బైటకు కనబడు అంతర్గత కాలము ఒకటినుండి రెండు దినములవరకు నుండును.

—♦ లక్షణములు (Symptoms) ♦—

పశువునకు తీవ్రమైనజ్వరము డిగ్రీలు 106, 108వచ్చును. మేతమేయుట మానును. మందమతిగా నుండును. ఊపిరియాడుట కష్టముగాయుండును. కన్ను, ముక్కు, నోరుమొదలగు శరీరావయవములలోనుండు పొరలు కంది ఎఱ్ఱగా నుండును.

మూతి పొడవుగ విస్తరించును. నోటినుండి చొంగగారును; గొంతుకక్రింద కొంచమెక్కువ వేడిగనుండి స్వల్పమైన వాపు కనబడును. ఈ వాపు గొంతుక, దవుడలు, గంగడోలు, మెడ, ముందరికాళ్లు మున్నగు భాగములందు పుట్టును. ఇంకను పశువు తలమీదను, కంటిరెప్పలమీదను, ముక్కురంధ్రములమీదను నోటిలోపలను, ఈ వాపులు కనబడిన ఆయా భాగములలోపల చర్మము ఎఱ్ఱగాకంది రక్తపుమచ్చలు కనబడును. నాలుక గూడ ఎఱ్ఱబడి వాచి, జిగురువంటి పదార్థము కారుచుండును. దగ్గుకూడనుండును. వాపు త్వరలోనే హెచ్చును. ఈ వాపు ముదిరినకొలది చల్లగానుండును. ఈవాపు తలకుగూడ వ్యాపించును. పశువు పడుకొనుచు లేచుచుండును. నాలుక గోధుమ వర్ణముగలిగియుండి జారవిడుచును. నోరు నలుపురంగుగా నుండును. ఈ వ్యాధి గొంతుకవద్ద కలుగుటవలన ఈ రోగమునకు కంఠమాదయనియు, ఊపిరియాడక పోవుటవలన గురకయనియు చెప్పుదురు. గురకపుట్టును; ఆగురక పెద్దధ్వనిగ చాలా దూరమువరకు వినబడును. ఊపిరియాడనప్పుడు పశువు తన వీపు గూనుగాపెట్టును. నొప్పితోగూడిన దగ్గుండును. కొన్ని పశువులకు ప్రేగులు తీవ్రముగా కందును. కడుపు నొప్పిపుట్టును. పలుచగా పారును. ఆపారుడులో నెత్తురుగూడ యుండును. కొన్ని పశువులకు ఈ వ్యాధిలక్షణములు కనబడకుండగనే అకస్మికముగానే చనిపోవును.

### — చచ్చినతరువాత కనబడు లక్షణములు —
### (Post mortem Appearances)

నాలుక ఎక్కువగావాచి గోధుమరంగుగా మారును. గొంతుకవాపు కోసిచూచినయెడల ఆ భాగములో పసుపు పచ్చనిజిగురువంటిపదార్థముకారుచుండును. శ్వాసకోశములు (గుండెకాయ) ఉబ్బియుండును. ఆహారకోశము ఎఱ్ఱగా కంది యుండును.

### — చికిత్స (Treatment) —

ఈ వ్యాధి సామాన్యముగా చికిత్సకు లొంగదు. ఇది ఆరంభించిన త్వరలోనే పశువు చనిపోవును. ఇది అంటుసంబంధమైన వ్యాధిగాన మంచిపశువులతో జబ్బుపశువుల నుంచరాదు. చచ్చినపశువుల పాతిపెట్టుట మంచిది. పశువునాలుక జారవిడిచి ఆయాసపడుచున్నపుడు ఆపశువు బ్రతుకదని గ్రహించవలయును. ఏ మందైనను లోపలికిపోసిన గుటకవేయలేక వెంటనే దగ్గి చనిపోవును.

నోటివెంట చొంగ పడినవెంటనే సారాయి 3 డ్రాములు, దుష్టుపాకుపసరు అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

లేక

పసుపు 2 తు, శొంఠి 2 తు, పిప్పళ్లు 2 తు, మిరియాలు 2 తు, వెల్లుల్లిపాయలు అర్ధసేరునవటాకు తెచ్చి ముద్దచేసి అర్థసేరు మునగచెక్కరసముతో కలిపి ముద్దలుచేసి వెంటనే పెట్టవలెను.

## —♦ టీకాలు వేయుట ♦—

మీ తాలూకా వెటరినరీ డాక్టరుగారిచే ఆరంభము లోనే మంచి గిత్తలకు పాడిపశువులకు టీకాలు వేయించవలయును.

పరా:— నూకలజావ గాని, పచ్చిమేత గాని, పెట్టవలెను.

## —♦ ఆంగ్లేయ చికిత్స (Allopathic Treatment) ♦—

కార్బాలిక్ ఆసిడ్ ¼ తులం, వరిగంజి సేరు, కలిపి త్రాగించవలెను.

లేక

పొటాషియం పర్మాంగనేట్ 1 తులం, నీరు సేరు, కలిపి వెంటనే త్రాగించవలెను.

లేక

ఫినైలు 1 ఔన్సు, వరిగంజి సేరు, కలిపి పశువుయొక్క మోతాదునుబట్టి ఈయవలెను.

## —♦ సారూప్యచికిత్స (Homoeopathic Treatment) ♦—

జ్వరముచే నోరుఎండి దాహముగా నున్నప్పుడు అకోనిటంను ప్రతి 3 గంటల కొకమోతాదు నీయవలెను. ద్రవము కూడ మ్రింగుట పడుట కష్టముగానుండి ముక్కులగుండ ఈ పదార్థములు వచ్చుచున్నపుడు, మెడ కంఠము బాగుగా వాచి యున్నపుడు, ఆభాగము ముట్టుకొనగనే, నొప్పి యెక్కువగా

నున్నపుడు శ్వాస ఎక్కువగా నున్నపుడు దినమునకు నాలుగు పర్యాయములు బెల్డోనాను వాడుట మంచిది.

ఈవ్యాధి కొంతవరకు తగ్గినపుడు మెర్క్యూరియస్‌ను వాడవలెను. తీవ్రమైన వ్యాధిలో సల్ఫర్‌ను దినమునకు రెండు మూడు పర్యాయములు వాడవలెను.

—♦ పథ్యము (Prevention) ♦—

తవుడు, కుడితి, జావ, పాలుగాని తదితర తేలిక ఆహారముగాని బార్లిజావగాని ఓట్సుజావగాని పచ్చిమేతగాని యిచ్చుచుండవలెను. సరియైన పశుశాలలో నుంచవలెను.

—♦ కురమ (Sympathetic Fever) ♦—

దీనినే చలికురమ, కురమ, ఒకవిధమైన జ్వరము అని చెప్పుదురు.

—♦ స్వభావము - వ్యాపకము (Distribution) ♦—

ఈ జాడ్యము వర్షాకాలము లగాయతు శీతాకాలము వరకు ప్రబలియుండును. ఇదియును ఒకవిధమైన అంటువ్యాధి. ఈవ్యాధి కలిగించు సూక్ష్మజీవులు ఒకతరగతి దోమలందు నివాస మేర్పరచుకొనును పశువు రక్తములోనుండు ఎఱ్ఱకణములలో నివిజేరియుండును. ఈవ్యాధినికలిగించు సూక్ష్మజీవులు పల్లపు భూములయందును, గొప్పనదులు సముద్రములో కలియు చోట్లను, అడవిప్రదేశములందును, బురదనేలలయందును, కుళ్ళుచుండెడి పెంటపోగులయందును దాగియుండును. ఎండలు తీవ్రముగా నున్నపుడు ఈ సూక్ష్మజీవులు బయటికి బయలు

దేరును. పశువును ఎండలో అపరిమితముగా పనిచేయించు నపుడు ఈజీవులు ఆపశువుశరీరములో ప్రవేశించును. పశువు నకు ఎండతగిలి ఆయాస మెక్కువగు నపుడును శరీరములో నెత్తురు బాగుగా ఉడుకెత్తినపుడును నెమ్మదిగా యీ జీవులు పశువుశరీరములోనికి ప్రవేశించి ఈవ్యాధిని కలిగించును. నెత్తురు ఉడుకెత్తుటచేత పశువుశరీరముమీద అక్కడక్కడ కొన్నిటికి వాపులుకూడ నుండవచ్చును. ఈ వ్యాధి నెత్తురుపట్టి యుండ లేతజంతువులకు తరచుగా వచ్చుచుండును.

## —♦ లక్షణములు (Symptoms) ♦—

ఆరంభములో పశువు వణకును. ఇట్లు వణకుటచే కొందరు వైద్యులు దీనిని చలికురమ యందురు. మలబద్ధక ముండును. అవయవములన్నియు వేడిగానుండును. పశువు నల్లకప్పు వేయును. చర్మము బిఱ్ఱ బిగిసియుండును. మూత్రము పసిమివర్ణముగ నుండి చాల వేడిగ నుండును. మేత మేయక మందముగానుండును. మోకాళ్ళు పట్టుపట్టి చాల బాధగా యుండును. పాదములు నిలువలేక తూలుచుండును. నాడి తీవ్రముగ కొట్టుకొను చుండును. పేడ గట్టిగా రాయవలెనుండును. చెవులు కాళ్లు చల్లగానుండు నపుడుకూడ చలికురమ యందురు. ముడ్డిపూస కడుపుబ్బరిం చును. ముక్కులవెంట నీరుగాని చీమిడిగాని పడుచుండును. అప్పుడప్పుడు దగ్గుచుండును.

## —♦ చికిత్స (Native Treatment) ♦—

ఈవ్యాధివలన పశువునకంతఅపాయములేదుగాని జాగ్ర

త్రగా చూచి చికిత్సచేయనియెడల ప్రాణాపాయము కలుగ వచ్చును.

ఆరంభములో దుష్టపాకుపసరు పావుశేరు, సారాయి 2 డ్రాములు, ముద్దకర్పూరము ¼ తులము కలిపి పోయవలెను.

తరువాత దుష్టపుతీగె పలుపువలె మెలికలుచుట్టి మెడలో వేయవలెను. అట్లువేసిన ఆతీగెయొక్క ఘాటు ఆ పశువు పీల్చుకొనును. ఇంకను ఆదుష్టపాకుపసరుకూడ నొప్పులు వాపులుగానున్న భాగములకు వ్రాయవలెను.

లేక

తిప్పతీగెరసము పావుశేరు, మంచినూనె అర్ధశేరు, కలిపి త్రాగించవలెను.

లేక

మేకపాలు అర్ధశేరు, పసుపు 2 తు, కలిపి ఒకసారి త్రాగించవలెను.

పరా:—వేడినీటిని త్రాగించవలెను. నూకలజావ పెట్ట వలెను.

—• ఆంగ్లేయచికిత్స (Allopathic Treatment) •—

సోడా సాలిసైలస్ 1 ఔన్సు, నీరు సేరు కలిపి త్రాగించవలెను.

లేక

క్యాంఫర్ ¼ తు, బెల్లము 4 తు, కలిపి నూరి నాలు కకు నాకించవలెను.

## —♦ నల్లతెవులు (Blood Disease) ♦—

ఈ వ్యాధి బురదనేలలోని తుంగ మొదలగు గడ్డిపదార్థములను తినుటచేత రావచ్చును. ఇదియును ఒక విధమైన అంటువ్యాధియైయున్నది. నెత్తురులో పుట్టినవ్యాధి యగుటచేత శరీరమంతయు వ్యాపించును. చర్మముక్రింద గడ్డలులేచును. అవి తాకి చూచినయెడల బుర బుర లాడును. వ్యాధిగలిగిన పశువులు వెంటనే చనిపోవును.

## —♦ చికిత్స (Native Treatment) ♦—

ముసాంబ్రము 4 తు, శొంఠి 5 తు, వేడినీళ్లు అర్ధశేరు కలిపి ఒకసారి త్రాగించుము.

లేక

దిరిసెనచెక్కరసము అర్ధశేరు, నరమూత్రము అర్ధశేరు కలిపి ఉదయసాయంకాలములందు త్రాగించవలెను.

లేక

నేరేడుచెక్కరసము అర్ధసేరు, నీరుల్లిపాయల రసము అర్ధశేరు కలిపి రెండుసార్లు త్రాగించవలెను.

## —♦ నల్లకప్పువేయుట (Blood Disease) ♦—

పశువు నిత్యము యెండలో పనిచేయునపుడు శరీరమునకు వేడితగిలి ఆవేడియే తలకెక్కును. ముఖము పాలిపోవును. దేహము కృశించి నలుపురంగుగా నుండును. సరిగా మేత తినక మందమతిగా నుండును. శరీరకాంతి తగ్గును. ఈవ్యాధికి

ఆరంభములోనే తగు చికిత్స చేయవలయును. లేనియెడల చావు తప్పదు.

—♦ చికిత్స (Native Treatment) ♦—

మోదుగపువ్వులు 3 తులములు, కల్లు అర్ధశేరు, కలిపి ఒకసారి త్రాగించవలెను.

లేక

వెదురాకు పిడికెడు, నల్లేరు అరతులము, ఆవపిండి ½ తు నేలవేము ½ తు, అడ్డసరాకులు పిడికెడు, గుమ్మడిపండు ఒకటి తెచ్చి వీటిని బియ్యపునీటితో నూరి తినిపించిన నల్లకప్పు పోవును.

లేక

మేకపంచితము శేరు, మోదుగపువ్వు 2 తు, పసుపు 1 తు, దిరిసెనఆకు పసరు అర్ధసేరు, కలిపి త్రాగించవలెను.

—♦ సారూప్యచికిత్స (Homoeopathic Treatment) ♦—

పశువు నల్లకప్పువేసినప్పుడు అకోనిటం అను మందును వాడవలెను. చర్మములోని వేడితగ్గును, నాడితీవ్రత, విశ్రాంతి లేకుండుట, మూత్రము కొద్దిగాపోయుట మున్నగు లక్షణము లున్నపుడు అకోనిటం వాడవలెను. ప్రతిరైతువద్ద ఈ ఔషధ ముండుట మంచిది.

—♦ ఆంగ్లేయచికిత్స (Allopathic Treatment ♦—

పొటాస్ నైట్రిస్ 1½ తు; వరిగంజి సేరు కలిపి త్రాగించవలెను.

లేక

చెయిరేటా 4 డ్రాములు; పొటాస్ నైట్రిస్ 2 డ్రా; అమ్మోనియం క్లోరైడ్ 1 డ్రా కలిపి ఆహారముతో తినిపించవలెను.

—♦ మశూచి (Cowpox) ♦—

దీనినే స్ఫోటకమందురు. ఈ వ్యాధి పశువులకు మేకలకు, గొఱ్ఱెలకు, పందులకు, గుఱ్ఱములకు, ఒంటెలకు, కుక్కలకు తగులును.

—♦ స్వభావము - వ్యాపకము (Distribution) ♦—

ఈ వ్యాధి పశువులనుండియే మనుష్యులకు సంభవించును. అంటుసంబంధమైనట్టియు, పొక్కులు లేచునట్టియు, జీవితమునందు సామాన్యముగా నొక పర్యాయము మాత్రమే కలుగునట్టియు జ్వరమని ఈవ్యాధినే యందురు. ప్రారంభలక్షణములు కనబడినది లగాయతు నెమ్మదియగువరకు ఈ వ్యాధి యందు అస్వస్థత ఉండినను, మాలిన్యమేర్పడినను, చర్మము నుండి పొక్కులు పరిపూర్ణముగ వదలిపోవువరకు విశేష అంటు గుణము వహించియుండును. ఈ రోగముగల పశువులతో మంచిపశువులు కలియుటవలనను, పశువులకాపరులు పాలుపితుకువారు, జబ్బుపశువులను తాకివచ్చి మంచిపశువులను తాకుట వలనను ఈ రోగము వ్యాపించును. మశూచి ఎక్కువగా పట్టణములలోనుండు పశువులకు తరచుగా వచ్చుచుండును.

—♦ లక్షణములు (Symptoms) ♦—

ఆరంభములో కొంచెము జ్వరమువచ్చును. కండ్లనుండి

నోటినుండి నీరుగారును. మేత మేయకుండును. పాలిచ్చు పశువులపొదుగుమీదను, చన్నులమీదను, దూడలకు మూతిమీదను, ఎద్దులకు తొడలమధ్యను, వెండ్రుకలు లేనిచోట్లను పొక్కులులేచి బఠాణీగింజలంతై పక్వమై పలుచబారి పగిలి ఒకవిధమైన రసికారును. వీనినే రసికుండలందురు. మనుష్యులకు వేయు టీకాలరసము ఈ రసికుండలనుండియే తయారు చేయుదురు. పాడిపశువునకు ఈ వ్యాధి తగులునప్పుడు పాలు తగ్గును. రెండు మూడు దినములైన తరువాత ఎఱ్ఱనిచుక్కలు పశువు శరీరముపై తేలును.

తరువాత పొక్కులుగా మారును. ఈస్థితి మారిన కొలది వ్యాధియొక్క ఉగ్రత తగ్గిపోవును. నాలుగుదినములైన తరువాత పొక్కులు శరీరమందంతటకు గూడ వ్యాపించును. ఈ పొక్కులు నీరుపట్టి, అడుగుభాగమునందు గుండ్రనై మధ్యభాగమునందు సొట్టబడి చుట్టుభాగము యెఱ్ఱనై యుండును. ఈ పొక్కులలో మాలిన్యమేర్పడినది మొదలు మశూచియందలి వాసన స్పష్టముగ కనబడును. వ్యాధి ఉద్రితగతిని వహించియుండినయెడల ముఖము వాడుదలనొంది, పశువునేత్రములు మూసుకొనిపోవును. పొక్కులు యెండిపోయి గోధుమ రంగుగా మచ్చలుబడి 20 వ దినమునకు నెమ్మదియగును. ఈ వ్యాధి తగిలిన పశువులయొక్క నేత్రములందుగాని, కర్ణములయందుగాని, కీళ్ళయందుగాని తరచుగ నేర్పడుట గలదు.

—♦ చికిత్స (Treatment) ♦—

మలబద్ధకమున్న యెడల చింతపండుపులుసు అర్ధశేరు; ఉప్పు చేరెడు; శొంఠిపొడి 2 తు; కలిపి త్రాగించవలెను.

—♦ ఆంగ్లేయచికిత్స (Allopathic Treatment) ♦—

ఎప్సన్‌సాల్టు 1 పౌను; జింజర్ 2 తు; నీరు 2 సేర్లు కలిపి త్రాగించవలెను.

లేక

పొటాస్ నైట్రిస్ ½ ఔన్సు; నీరు సేరు కలిపి త్రాగించవలెను.

—♦ పుండ్లకు ♦—

బోరిక్ ఆయంటుమెంటుగాని; సొల్యూషన్‌గాని; కార్బాలిక్ ఆయంటుమెంటుగాని సొల్యూషన్‌గాని అప్పుడప్పుడు పుండ్లకు రాయుచుండవలెను.

—♦ న్యూమోనియా (Pneumonia) ♦—

—♦ స్వభావము (Distribution) ♦—

దీనినే ఊపిరితిత్తులవాపందురు. ఈవ్యాధికూడ ఒకవిధమైన అంటు జ్వరమని జంతుశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. ఇదిపశువులయొక్క శ్వాసకోశములకు తగులును. చలిగాలి ఎక్కువగా సోకుటవలనను ఎల్లప్పుడును పశువును వర్షములోనుంచుటవలనను ఈవ్యాధివచ్చును. ఈవ్యాధి పాడిపశువులకంటె పాటుపడు పశువులకు తరచుగా సోకుచుండును. ఈవ్యాధిగల పశువు

యొక్క ఒక ఊపిరితిత్తికిగాని, కొన్నిటికి రెండుతిత్తులకుగాని సోకవచ్చును. మలినపుగాలి నెక్కువగా పీల్చుటచేత ఈవ్యాధి రావచ్చునని కొందరు డాక్టర్లు చెప్పుచున్నారు. ఈవ్యాధి యొక్క లక్షణములు ఋతువులనుబట్టియు స్థలములనుబట్టియు పశువుయొక్క వయస్సును బట్టియు వ్యాధితగులకముందు రోగి యొక్క ఆరోగ్యమునుబట్టియు నుండును. ఈవ్యాధికికూడ కొన్నిపురుగులే మూలకారణము. దీనిని మనరైతులు కనిపెట్టుట కష్టము. పశువు గుండెమీాద స్టెతస్కోపు పెట్టి లోపల నుండు శ్వాసకోశములనుండి వచ్చుధ్వనినిబట్టి ఈరోగమును గుర్తించవలెను. ఈవ్యాధి సంబంధమగు పురుగు లొకవిధమైన విషమును తయారుచేసి తదితర పశువులకు ప్రసరింపజేయును. గాన జాగ్రత్తగా పశువును కాపాడవలెను. ఈ వ్యాధి తగిలిన పశువు చొంగపడినస్థలము పరిశుభ్రము చేయనిచో నా ప్రదేశముమీాద ఆ రోగసంబంధమైన విష మొక సంవత్సరము వరకుండునని శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు.

## —♦ లక్షణములు (Symptoms) ♦—

ఈ వ్యాధికి ఆరంభములోనే పశువు ప్రక్కభాగము లందు ఉద్రితమగుబాధ ప్రారంభమై పోటుపొడిచినట్లుండును. ఊపిరితిత్తులు కందియుండుటవలన శ్వాస మిక్కిలి ఆయాసముగాయుండును. కొన్నిటికి జ్వరముండదు. అంటుసంబంధమైన జ్వరమైనయెడల దీర్ఘకాల ముండును. ప్రారంభములో ఎక్కువ లక్షణములు కన్పడవు. పనిచేయించునపుడు పశువు అలసిపోవును. తదితర పశువులతోనుండక విడిగానుండును.

శ్వాసకోశములు కుళ్ళిన యెడల ఊపిరి వాసనకొట్టును. నాడి తొందరగా కొట్టుకొనుచుండును. మూత్రము తీవ్ర వర్ణము కలిగియుండును. ఈ వ్యాధియందు దగ్గుకూడ నుండును. వ్యాధి ముదిరినకొలది రక్తముకూడ క్షీణించును. క్రమక్రమముగ గుండె అస్వస్థత జెంది శ్వాసకోశములలో విషపదార్థములు పేరుకొని ఉచ్ఛ్వాస నిశ్వాసల నాడనీయక పోవుటచే పశువు మరణించును.

## చికిత్స (Treatment)

ఈవ్యాధికి మన ఆయుర్వేద పశువైద్యులు చికిత్సలు చేయుట బహుకష్టము. కొన్ని మందులను ఇంజక్షను చేయవలసి యుండును. అందుచే యిట్టి లక్షణములు కలిగిన పశువులను వెంటనే పశువైద్యశాలకు తీసికొనిపోవుట చాల మంచిపని. అట్లుచేయుటకు వీలులేనిచో నీరు ఒకపాత్రలో మరగించి కర్పూరతైలముగాని, యూకలిప్టస్ ఆయిల్ గాని వేసి దాని నుండి వచ్చు ఆవిరిని ముక్కురంధ్రములోనికి పట్టించవలెను. పశువు ఎదురురొమ్మునొప్పికికూడ ఉపశాంతి చేయవలసి యుండును. ఈనొప్పిని తగ్గించుటవలన రోగ పశువుయొక్క సామాన్యస్థితి అభివృద్ధి పొందును. ఇందుకొరకై కొందరు ఆవాలు పట్టువేయుదురు. ఇది యెక్కువగా వేసినయెడల అపకారము చేయునుగాన అమితముగా వేయరాదు. ఇంకను పిండికట్టు కట్టవచ్చును. కర్పూరతైలము రాచి వేడికాపడ ములు కాయవచ్చును. వేడికాపడములు కాయు గుడ్డలో

నీ రెంతమాత్రము యుంచక పిండివేసి కాపులు కాయవలెను. అప్పుడప్పుడు సారాయిని తాగించవచ్చును.

## —♦ హెచ్చరిక (Treatment) ♦—

వ్యాధితగిలిన పశువును శుచియైన స్థలములోనుంచి పరిశుభ్రమైనగాలి తగులునట్లు చేయవలెను. రోమ్ములనకు చలిగాలి తగులకుండ వెచ్చని ఉన్నిబట్టలు, కంబళి మొదలగువానిని కప్పవలెను. మేత మేయనియెడల బలవంతముగా పెట్టరాదు. ద్రవసంబంధమైన పదార్థములేవియు త్రాగింపరాదు. ఏమందైనను లేహ్యముగాచేసినాలుకకు రాయవలెను. బార్లిగంజిగాని నూకలజావగాని పెట్టవలెను. పశువునకు బలముకలిగించు పదార్థములుకూడ పెట్టవచ్చును. పశువు నోటినుండి కఫముపడుచుండినయెడల ఆ కఫమును శుభ్రముగా తీసివేసి ఫినైల్‌గాని, కార్బాలిక్ ఆసిడ్‌గాని, పిప్పర్‌మెంటుఆయిల్‌గాని ఆ కఫము పడినచోట చల్లవలెను.

## —♦ సారూప్యచికిత్స (Homoeopathic Treatment) ♦—

అకోనిటం, బ్రియోనియా, ఫాస్ఫరస్, ఆర్సెనికం, అమ్మోనియా కాస్టికం, సల్ఫర్ మంచి ఔషధములు.

జ్వరముండి నాడి యెక్కువై శ్వాసకష్టముగా పీల్చునపుడు అకోనిటం అనుమందును వాడవలెను. అకోనిటం వాడినపుడు పూర్తిగా పనిచేయకయున్నసమయములో బ్రియోనియాను అకోనిటంను ఒక మోతాదువంతున వాడవలెను.

దగ్గు ఆగిఆగి ఎక్కువసార్లు వచ్చునపుడు శ్వాసకోశము లలో ధ్వనితగ్గి, శ్వాసకష్టముగా పీల్చునపుడును నోటినుండి రక్తముతోకూడిన కళ్లెపడుచున్నపుడును ప్రతి 1 లేక 3 గంటల కొకసారి వ్యాధినిబట్టి ఫాస్ఫరస్‌ను వాడవలెను.

పశువు ఎక్కువగా శుష్కించుచు జ్వరము తీవ్రముగా నున్నపుడు ద్రవము ఎక్కువగా కారునపుడు మలము ఎక్కువగా నగునపుడు రోగము ప్రబలినపుడు ఆర్సినికమ్‌ను పై మందుల తోడుగా వాడవలెను. ఈవ్యాధి తిరుగుముఖమై దీర్ఘపడిశ మున్నపుడు సల్ఫర్‌ను వాడవలెను.

## పథ్యము (Prevention)

ఈవ్యాధి పశువునకు సోకగనే వెంటనే యజమాని గమనించి మొదటి అవస్థలోనే తగిన చికిత్సచేయకపోయినచో వ్యాధి ప్రబలమై ప్రమాదము సంభవించును. పశువునకు జావగాని అవిసెవిత్తుల కషాయముగాని మంచి ఎండుమేతగాని యిచ్చుచుండవలెను. వ్యాధిగల పశువును యితరజంతువుల నుండి విడదీసి యుంచవలెను.

## క్షయ (Consumption)

## స్వభావము (Distribution)

ఇదియొక విధమైన అంటువ్యాధి. ఈవ్యాధి అన్ని విధములగు జంతువులలోను వ్యాపించును. పశువుయొక్క శ్వాస కోశములందు ఒకవిధమైన పురుగు ప్రవేశించి వానిని క్షీణింప జేయుటవలన ఈ వ్యాధి కలుగుచున్నది. పశువుల కళ్లెలోను,

చొంగలోను, పాలలోను, రక్తములోను, ఊపిరిలోను ఈ పురుగు వ్యాపించియుండును. ఆహారపదార్థములమూలమునను, గాలిమూలమునను, సూక్ష్మజీవి పశువుయొక్క శరీరములోను ప్రవేసించును. జబ్బుగల పశువులు మంచి పశువులతో కలిసియుండుటచేత ఈవ్యాధి విచ్చలవిడిగా విజృంభించును. కనుక జబ్బుగల పశువులను ఆరోగ్యపశువులనుండి విడదీసి ప్రత్యేకస్థలమునం దుంచవలెను. ఈసూక్ష్మజీవికి పశువుయొక్క శరీరము వెలుపలగూడ జీవించుశక్తిగలదు. పశువుల కొట్టము అనారోగ్యముగను అపరిశుభ్రముగ నుండుటచేత ఈ రోగము పెంపొందును. ఈవ్యాధి కొన్నివారములుగాని మాసములుగాని యుండును. ఈవ్యాధి ముదరకమునుపే చికిత్స చేయుట మంచిది. ఈవ్యాధి అన్నిజాతుల జంతువులకును, మనుష్యులకును, పక్షులకుగూడ సోకును. ఇది సామాన్యముగ పట్టణములలోనుండు పశువులకు ఎక్కువగా వచ్చుచుండును. అనారోగ్యప్రదేశములలో నుంచుటవలనను, పశువు పేడ, చెత్త, మూత్రము మున్నగువానిని నిలువయుంచుట చేతను గాలి వెలుతురులేని కొట్టములలో పశువులను కట్టివేయుటవలనను, దోమలు, ఈగలు యెక్కువగానుండు మురికి ప్రదేశములలో పశువుల కట్టివేయుటవలనను, ఈ వ్యాధి ప్రబలుచుండును. ఈ వ్యాధిని కలిగించు సూక్ష్మజీవి మంచి పశువులకుండు గాయముల మూలమునను, త్రాగెడి నీటి మూలమునను, పీల్చు చెడుగాలివలనను, లోపలికి ప్రవేశించి వ్యాధిని గలుగజేయును.

## —♦ లక్షణములు (Symptoms) ♦—

ఈ వ్యాధి ముఖ్యముగా శ్వాసకోశములలో వృద్ధియగు చుండును. దగ్గు ముఖ్యలక్షణము. ఆ దగ్గు మొదట కొంచె ముగానుండి క్రమ క్రమముగా హెచ్చును. పనిచేయునపుడు మిగుల ఆయాసముగానుండును. దగ్గు యెక్కువైనకొలది తెమడ ఎక్కువగాపడుచుండును. క్రమముగా శుష్కించి పోవును. జీర్ణ శక్తితగ్గును. అందుచే ఆహార మెంత పెట్టినను నీరసముగానుండి కృశించును. పశువు బలహీనమైనకొలది తగ్గు చుండును. జ్వరము అప్పుడప్పుడు వచ్చుచుండును. ఈ వ్యాధి తగిలినపశువు చనిపోవుటకు కొంతకాలముపట్టును. పైన వ్రాసినట్లు శ్వాసకోశములందేగాక జీర్ణకోశములందుగూడ క్షయ అభివృద్ధిజెందును. అప్పుడు పలుచగా పేడవేయును. కడుపుబ్బరముండును, కనుగుంటలు విడుచుండును. పేగులుచెడ వచ్చును. ఆహారమును జీర్ణముచేసికొన లేకపోవును. పాడిపశువైన యెడల పొదుగు గట్టిపడి వాచియుండును. ఆ పొదుగులో పాలు పలుచగను నీరువలెనుండి ఒకవిధమైన పచ్చనిరంగుగలిగి యుండును. పొదుగు పూర్తిగా చెడునప్పటికి పాలేమియు నుండవు. ఈ వ్యాధి ముదిరినకొలది ఎముకలు కీళ్లు జబ్బుపడుట, బలహీనతజెందుట, నడచునపుడు కుంటుట మొదలగు లక్షణములు కనబడును. రాను రాను కఫజ్వరము యెక్కువై మరణము సంభవించును.

## —♦ చికిత్స (Treatment) ♦—

సాధారణముగా యీ వ్యాధి వైద్యులు కనుగొనుట

కష్టము. అందుకొరకు ప్రత్యేకముగా తయారు చేయబడిన "ట్యూబర్కులిన్" అను యింగ్లీషుమందొకటి కలదు. దానిని శరీరములోనికి ఇంజెక్షను చేసిన యెడల దానివలన శరీరము నందు కలుగు మార్పులను బట్టి యీవ్యాధిని నిర్ణయింప వచ్చును. ఈవ్యాధికి పశువును అతిజాగ్రత్తతో సంరక్షించుటయే తక్క వేరొండు మంచి చికిత్సలేదు. ఈ వ్యాధిగ్రస్తమగు పశువును ధారాళముగా గాలి వెలుతురువచ్చు కొట్టములలో నుంచవలెను. పశువులను ఎక్కువగా మేపరాదు. అమెరికా మున్నగు దేశములలో క్షయవ్యాధిగల పశువులను ప్రతిదినము పరీక్షించిగాని వాటిపాల నమ్మనీయరు. ఈవ్యాధిని గురించి తగినంత శ్రద్ధతీసికొనకపోయినచో ఒకపశువునుండి మరియొక పశువునకు యీ వ్యాధి వ్యాపించును గాన మంచి పశువులతో వ్యాధిగ్రస్తమగు పశువును కలుపరాదు.

## హెచ్చరిక (Prevention)

ప్రతిపట్టణములో నుండు పశువధశాలలను పశువైద్యులచే పరిశోధన చేయించుట మంచిది. ఆహారార్థము వధార్హములగు జంతువులు కేవలము వయసుచెందినవి గాకుండగను చూడిపశువులు గాకుండగను, పసిదూడలు గాకుండగను, జాడ్యగ్రస్తములైనవి గాకుండగను, కేవలము బక్కచిక్కినవి గాకుండగను ఉండవలయును. పశువధశాలలు వాని సమీప ప్రదేశములు శుచిగా నుండుటావశ్యకము. క్షయ దొమ్మ మొదలగు జాడ్యముల వలన మృతినొందిన జంతువుల మాంసమును భక్షించుటచేత భక్షకులకు సైతము ఈజాడ్యము

సంభవించును. ఈవిషయము చక్కగా మనస్సునందు నాటి యుండవలెను. ఏలనన ఈ దేశమం దంతట హీనజాతులవారు తమకెచ్చటనైన చచ్చిన పశువు దొరకినయెడల దానిమాంస మును సంకోచములేక తిందురు. అట్టివారు పెక్కురోగముల పాలగుచున్నారు. పాశ్చాత్యదేశములలో భక్షించు మాంసా దుల విషయమై పానముచేయు క్షీరముల విషయమై అనేకము లైన కట్టుదిట్టములు శాసనములు ప్రజలక్షేమము కొరకై చేయబడి యున్నవి.

పట్టణములలో పాలను పితుకుట విక్రయించుట మొద లగు విషయములగురించి శాసనమొకటి అత్యవసరమై యున్నది. అట్టి శాసనము పుట్టువరకు పాలను కొనెడివారు తాము కొనుచున్నపాలు ఎక్కడనుండి తమకు చేరుతున్నవో చక్కగా తెలిసికొని జాగరూకులై యుండవలెను. రోగముగల పశువులపాలు పానయోగ్యములు కానేరవు. గనుక అట్టిపాలను వాడరాదు. పశువులయొక్క రోగము నివారించుట పాల యొక్క ఆరోగ్యము కాపాడుట మున్నగు కృత్యములు పశు వైద్యపు టుద్యోగీయులకు చెంది యున్నది. పశువులలో ఏపశువునకైనా క్షయవ్యాధి యున్నయెడల ఒక పశువునుండి మరియొక పశువున కది వ్యాపించుటయేగాక ఈవ్యాధి తగిలిన పాడిపశువుయొక్క (ఆవు, గేదె) పాల నుపయోగించుటవలన మనుష్యులకును ముఖ్యముగా చంటిబిడ్డలకును ఈవ్యాధి తగిలి వారి కపాయము కలిగించును. ఇదియే మనము ముఖ్యముగా గమనించవలసిన విషయము.

## —♦ పీనసరోగము (Nasal Polypi) ♦—

### —♦ స్వభావము (Distribution) ♦—

ఈ వ్యాధి ఒకవిధమైన యీగలవలన కలుగుచున్నది. ఇది కూడ అంటువ్యాధియే యని నానమ్మిక. ముక్కురంధ్రములలో ఈగలుచేరి ఒకవిధమైన మలినపదార్థమును విడిచి పెట్టును. తదుపరి ఆ రంధ్రములలో ఒకవిధమైన చీము కుతపలు కుతపలుగా నుండి కురుపులుగా లేచును. ఇవి బాగుగా పెరిగి పగిలి చీముకారుచుండును. ముక్కు ను పరీక్షించినయెడల కుతపలు స్పష్టముగా కనబడును. ఈ వ్యాధి ముదిరినకొలది మెదడునకుకూడా సోకి పశువు మరణమునకు కూడా సిద్ధమగును. ఈవ్యాధి సంవత్సరమువర కుండును.

### —♦ లక్షణములు (Symptoms) ♦—

పశువునకు జ్వరముండును. ముక్కులనుండి చిక్కని చీమిడిపడుచుండును. అప్పుడప్పుడు తుమ్ముచుండును. అర మేతమేయును. నోరు చాల అసహ్యముగా నుండును. ముక్కు రంధ్రముల చుట్టు ఈగలు ముసురుచుండును. ఉచ్ఛ్వాస నిశ్వాసముల నాటంకపరచుచుండును. ఈ వ్యాధి ముదిరిన కొలది గురకపుట్టి తుమ్ము లెక్కువగును. అప్పుడప్పుడు ముక్కు బెదరి రక్తము కారుచుండును. పశువు చాల బాధపడుచుండును. సరియైన చికిత్సచేయనిచో పశువు కొలదికాలములోనే మరణించును.

—• చికిత్స (Treatment) •—

ముక్కులను మైలతుత్తపునీటితోగాని పటికనీటితో గాని పిచికారిచేయుచుండవలయును.

తరువాత

హారతికర్పూరము 1 తులం, వస ½ తు, కలిపి అప్పుడప్పుడు ముక్కులోనికి పార ఊదవలెను.

లేక

నీరుల్లిపాయల రసము 1 తు, తులసియాకురసము 1 తు కలిపి ముక్కులో పోయుము.

మీ తాలూకా గవర్నమెంటు వెటరినరీ డాక్టరు గారిచే ఇంజెక్షన్ చేయించుము.

—• హెచ్చరిక (Prevention) •—

ఇటువంటి పశువులను ప్రత్యేకముగా నుంచుట మంచిది. వీటికి నీరు త్రాగుటకు ఆహారముంచుటకు ప్రత్యేకముగా తొట్లనుంచవలయును. పశువు ముక్కురంధ్రములలో ఏవిధమైన గాయములు యున్నను ఆగాయములగుండ వెంటనే ఈవ్యాధి సోకును.

—• సారూప్యచికిత్స (Homoeopathic Treatment) •—

వ్యాధిసోకినవెంటనే అకోనిటంనాప్ గాని, ఆర్సెనికం అల్బము 10 చుక్కలుగాని ప్రతి మూడుగంటలకు ఈయవలెను.

పుండ్లు కనపడుచున్నయెడల ఆంటిమోనియం టార్టా

రమును ప్రతి మూడుగంటలకు ఒక గ్రెయినువంతున ఈయ వలెను.

పుండ్లుమానుటకు సిద్ధముగానున్నప్పుడు స్పిరిట్సు ఆఫ్ క్యాంఫర్‌ను ప్రతి పది పదియేను నిమిషములకు 10 లేక 15 చుక్కలు యిచ్చుచుండవలెను.

దేహమంతయు పగిలి గజ్జిగానున్నపుడు సల్ఫర్‌ను యిచ్చుట మంచిది.

—♦ ఆంగ్లేయచికిత్స (Allopathic Treatment) ♦—

ముక్కులలో కుతపలు కనపడుచున్నయెడల జింకు సల్ఫేటులోషనును ముక్కురంధ్రములలోనికి పిచికారిచేసిగాని, హైడ్రొజరీపెరాక్సైడ్‌ను కొన్నిచుక్కలు ముక్కులలోపోసి శుభ్రముచేసి టించ్చర్ అయోడిన్‌గాని, కార్బాలిక్ ఆయిల్ గాని రాయుచుండవలెను. లోపలికి విరేచనములకు మందు ఒకపర్యాయ మీయవలెను.

—♦ రక్తశూల ( Colic ) ♦—

ఈరోగము పశువు మెదడు చెడుటవలనను, ఎండలోను వడగాడ్పులలోను పశువును పనిచేయించుట వలనను, వేడిమి కలిగించు దాణాదినుసులను మేపుటవలనను పశువులకుకలుగును.

—♦ లక్షణములు (Symptoms) ♦—

పశువునకు జ్వరము తగులును. గొంతునాళములు చాల వేడిగానుండును. దేహము కృశించును. ముక్కులనుండి నోటి

నుండి, ఆసనమునుండి నెత్తురు పడుచుండును. పశువు మేత మేయదు. ఒకవిధమైనశూలకలిగి పశువు చాలబాధ పడుచుండును. మూల్గును; పండ్లుకొరకును. రక్తము స్రవించినకొలది పశువు నీరసించును. నోరుదుర్వాసన వేయును. కాళ్లుపట్టు వేయును. వ్యాధి ముదిరినకొలది పశువు నడవజాలదు. సరియైన చికిత్సలు చేయనిచో వెంటనే చనిపోవును.

—• చికిత్స (Native Treatment) •—

ఈతగుంజు అరవీసె, పంచదార అర్ధసేరు నవటాకు కలిపి ఒకసారి పెట్టుము.

లేక

నేరెడుచెక్కరసము అర్ధసేరు, ఆవాలు అర్ధసేరు, ఈమోతాదు వంతున కలిపి రెండుసార్లు త్రాగించవలెను.

లేక

ఆముదము వేళ్లు 2 గుప్పెళ్లు, దర్భవేళ్లు 1½ గుప్పెళ్లు పల్లేరువేళ్లు 2 గుప్పెళ్లు, రెల్లువేళ్లు 3 గుప్పెళ్లునూరి కషాయము కాచి అర్ధశేరు ఆవుపాలలో కలిపి ఒకసారి త్రాగించవలెను.

లేక

అర్ధశేరు గేదెమూత్రము రెండుపూటలు త్రాగించవలెను.

లేక

ఆడగుఱ్ఱపులద్దె గుడ్డలోవేసి పిండగా వచ్చినరసములో వేయించిన యింగువ తులముకలిపి ఒకసారి త్రాగించవలెను.

లేక

ఉత్తరేణిఆకుపసరు గిద్దెడు, ఆవుపాలు అరసోలెడు కలిపి అప్పుడప్పుడు పోయుచుండవలెను.

—♦ హెచ్చరిక (Prevention) ♦—

ఈ వ్యాధిగల పశువును ప్రత్యేక స్థలమునం దుంచవలెను. రక్తముకారు శరీరభాగములను పటికలోషన్‌లోగాని, మైలతుత్తపు లోషన్‌చేగాని కడుగవలెను. ఈగలను మూగనీయరాదు. అర్ధశేరు పెసరగుగ్గిళ్లలో అరసోలెడు నెయ్యికలిపి తినిపించవలెను. లేక అర్ధసేరు నూకలజావ త్రాగించవలెను.

—♦ ఆంగ్లేయచికిత్స (Allopathic Treatment) ♦—

క్లోరిడైన్ ½ ఔన్సు, నీరు సేరు, కలిపి త్రాగించవలెను.

లేక

సోడాబైకార్బనేట్ 2 ఔన్సులు, టర్పెంటైన్ 1 ఔన్సు ఓపియం 1 డ్రాము వేడినీరు సేరు కలిపి త్రాగించవలెను.

లేక

ఇండియన్‌హెంపు 3 డ్రాములు, అసఫటీడా 2 డ్రాములు నల్లఉప్పు 2 డ్రాములు మంచిబెల్లపునీరు సేరు కలిపి త్రాగించవలెను.

లేక

క్లోరల్‌హైడ్రేట్ 1 ఔన్సు గంజి సేరు కలిపి త్రాగించవలెను.

—◆ సారూప్య చికిత్స (Homoeopathic Treatment) ◆—

శూలనొప్పి ఆహారముచే గాక యితరవాటివలనకూడ వచ్చును. నీరుడు కొద్ది కొద్దిగా వచ్చుచుండుట ఒక్కొక్క సమయములో లేకపోవుట; నక్సువామికాను ఈ వ్యాధికి 20, 30 నిమిషములకు ఒక మోతాదువంతున యిచ్చిన బాగుగా పనిచేయును. ఇంకను కోలోసింథిస్, కాక్యులస్‌ను వాడవచ్చును.



# ప్రముఖులఅభిప్రాయములు

శ్రీరాములుచౌదరిగారి పశుసేవను గూర్చి చేయుచున్న కృషికి నేను మిక్కిలి సంతసించుచున్నాను. వీరు సామాన్యఆపరేషన్సు, ఔషధములిచ్చుట కూడ చేయుచున్నారు. అంటువ్యాధులవిషయమై రైతులకు బోధించుచున్నారు. నోరులేనిపశువులకు మిగుల కష్టించియు, మిక్కిలి యుత్సాహముతో సేవజేయుచున్నారు. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

(సం) సి. వి. రత్నం,
కృష్ణా గుంటూరు జిల్లా వెటరినరీ ఆఫీసర్.

---

చౌదరిగారిచే స్థాపింపబడిన. ఆయుర్వేదపశుచికిత్సాలయమును సందర్శించితిని. చికిత్సలవిషయమై చాల తృప్తికరముగా నున్నది. పశుసంరక్షణవిషయమై వీరు తీసికొనుచున్న శ్రద్ధ అపారము. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

(సం) కె. బి. నటేశయ్యరు,
జిల్లా పశువైద్యఆఫీసర్.

---

శ్రీరాములుగారి చికిత్సాలయమును చూచితిని. ఇది క్రమపద్ధతిని అభివృద్ధిజెందుచున్నది. మూగజీవులకు వీరొసంగురక్షణ మిగులప్రశంసనీయము. ఆయుర్వేదపశువైద్యగ్రంధములు వ్రాసి తత్సంబంధమైన వైద్యమును వీరు అభివృద్ధిపరచిరి. అన్ని ప్రాంతములవారు తగినసహాయము చేయుదురుగాక.

(సం) ఆర్. వీరాస్వామి,
వెటరినరీ అసిస్టెంటుసర్జన్.

---

చౌదరిగారు ఆయుర్వేదౌషధములచేతనే చికిత్సలు చేయుచున్నారు. పశువైద్యశాస్త్రమునందు అనుభవము పొందినవారై తదితరజిల్లాలనుండి రాబడిన విద్యార్థులకు బోధించుచున్నారు. ఈ సంవత్సరము గవర్నమెంటు వారిచే రిజిస్టరు చేయబడినందువలననే చాలమంది విద్యార్థులు విద్య నభ్యసించుచున్నారని తెల్పుట సంతోషము. అంటువ్యాధులయందు కూడ వీరికి పరిచయము కలదు.

కె. యం. పేరనన్,
వెటరినరీ అసిస్టెంటు సర్జన్.

---

శ్రీరాములుచౌదరిగారిచే నడుపబడుచున్న నిఖిలాంధ్రాయుర్వేద పశువైద్యకళాశాలను, పశుచికిత్సాలయమును చూచి మేము చాలఆనంద పడుచున్నాము. కాలేజీలో చాలమందివిద్యార్థు లున్నారు. వీరిని ఆయు ర్వేద పశువైద్యపద్ధతులమీద తర్బీతుచేయుచున్నారు. చౌదరిగారు చికి త్సలు చక్కగా చేయుచున్నారు. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

యన్. వి. శ్రీధరరావు,
వెటరినరీ సర్జన్, జి. యం. వి. సి.
యస్. శ్రీనివాసరావు,
మ్యునిసిపల్ వెటరినరీ అసిస్టెంటు సర్జన్.

---

చౌదరిగారిచే స్థాపింపబడిన చికిత్సాలయము చూచితిని. నవీనపద్ధ తులతో నడిపింపబడుచూ నోరులేని వేలకొలదిజంతువులను రక్షించుచున్న నూతనోద్యమము. ప్రశంసార్హమగు వారి యుద్యమము జయప్రదమగుగాక.

కె. గురుమూర్తి,
అగ్రికల్చర్ డిమాన్‌స్ట్రేటరు.

---

శ్రీరాములుచౌదరిగారిచే నడుపబడుచున్న పశుచికిత్సాలయమును, పశువైద్యకళాశాలను దర్శించితిమి. ఆంధ్రదేశములో నేగాక రాజధానిలో కూడ వేరొకసంస్థ లేదు. వీరిపట్టుదల, మేధాశక్తి అపూర్వము. ఇట్టి సంస్థలను ఆధారము చేసికొనినగాని గ్రామపునరుద్ధారణకు మనరాజకీయవేత్తలు పెద్దలు పడుశ్రమ పరిపూర్ణఫలమునొందదు. ఈ సంస్థ అన్ని విధముల అభివృద్ధిజెందుగాక అనికూడ అభిప్రాయము.

వి. బుధవేశ్వరరావు,
డిప్యూటీ డైరక్టర్ ఆఫ్ అగ్రికల్చర్,
2 వ సర్కిల్, గుంటూరు.

యస్. శివరామపాత్రో,
అగ్రికల్చర్ ఆఫీసర్.

---

చౌదరిగారి కళాశాల, చికిత్సాలయములను చూచితిని. వారుచేయుచున్నపని చాల అత్యద్భుతముగానున్నది. గ్రామపునర్నిర్మాణమునకు దగినటుల ఈసంస్థలు పనిచేయుచున్నవి. వీరు దిగ్విజయమును పొందుదురుగాక.

చంద్రశేఖరం,
డిప్యూటీరిజస్ట్రార్
కో-అపరేటివ్ సొసయిటీస్.

---

చౌదరిగారి చికిత్సాలయము పరిశీలించితిమి. పశుసంరక్షణవిషయమై చౌదరిగారు అనేకరీతులుగా చాల శ్రద్ధతీసికొనుచున్నందులకు మేమెంతయు సంతసించుచున్నాము.

డి. సదాశివరెడ్డి,
మద్రాసుప్రెసిడెన్సీ డిప్యూటీ ఎడ్యుకేషనల్ డైరక్టర్.

యం. అబ్దుల్ ఆలీ,
కృష్ణాజిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసర్.

---

ఆయుర్వేదపశువైద్యమునం దీమాత్రపుకృషి మిత్రుడుసల్పుచుండు టెంతో ప్రీతికరమైనవిషయము. వీరొసగు పశువైద్యవాఙ్మయము ఆంధ్ర దేశమునకును, రైతునకును మిగుల ప్రయోజనమైనది.

బి. రామయ్య,
ఎ. డిమాన్‌స్ట్రేటర్.

---

ఆంధ్రదేశములో ఆయుర్వేద పశుచికిత్సాలయములుగాని, ఆయు ర్వేద పశువైద్య కళాశాలలుగాని సరియైన ఆయుర్వేద పశువైద్య గ్రంథ ములుగాని యింతవరకు లేవనియే చెప్పవచ్చును. ఇట్టి సమయములో "అభి నవ సహదేవ" శ్రీరాములు చౌదరిగారు పై సంస్థలను తన స్వయంకృషి చే వృద్ధిలోనికి తీసికొనివచ్చుచున్నందులకు ఆంధ్రదేశములోనున్న ప్రజలందరు గర్వింపతగిన విషయము. వీరి కాలేజికూడ చాల వృద్ధిలోనున్నది. స్థానిక సంస్థలుకూడ స్టయిపెండ్సుయిచ్చి విద్యార్థులను ఈ కాలేజికి పంపుచు న్నారనిన ఆంధ్రదేశమున కెంతలాభముగలదో చదువరులే గ్రహించుదురు గాక. ఇంకను తరగతులవారీగా 26 పశువైద్యగ్రంథములువ్రాసినారంటే ఎంతగొప్పమేధావంతులో పాఠకులే గ్రహించుదురుగాక. వీరి గ్రంథ ములు త్వరలో అప్రూవ్ చేయించి అన్ని పాఠశాలలలోను పెట్టించిన చాల ఉపయోగకరముగానుండును. నూతనముగావచ్చిన కాంగ్రెసుమంత్రులు ఈ కళాశాలను రికగ్నయిజు చేయించి అన్ని ఫిర్కాలలోను ఈ ఆయు ర్వేద పశువైద్యమును వ్యాపింపజేయగలరని నా నమ్మిక.

ఎ. వి. రామలింగపాట్నాయక్,
యం. బి. బి. యస్.

---

డాక్టరుగారి స్వగృహమున ఒక పెద్దహాలులో పశుచికిత్సాలయము స్థాపించబడి వివిధపరికరములచే సమకూర్చబడియున్నది. పేదలనక భాగ్య వంతులనక అందరికి నుచితముగా చికిత్సలుచేయు ఇట్టి సంస్థ మరెచ్చటను లేదు. ఔషధములు తయారుచేయుటయేగాక డాక్టర్ గారు పశురోగము లను, దేహతత్వములను బోధపరచుటకు అనేకపటములు, చిత్రపటములు కూడ తయారుచేసినారు. పశువైద్యశాస్త్రమునందు శిక్షను గలుపుటకై

ఆయుర్వేద పశువైద్యకళాశాలను గూడ వీరు నడుపుచున్నారు. ఈ సంస్థ యెంత ప్రజాదరణమును బడసినదో ఇతర జిల్లాలనుండి ఈ కళాశాలలో జేరుటకు వచ్చినవారివలన తెలియుచున్నది. పదునొకండవ కమ్మ మహాజన సభయందు చౌదరిగారి సేవకై మెచ్చి వారిని "అభినవసహదేవ" అను బిరుదముచే బహూకరించిరి. ఈ బిరుదమునకు వీరెంతయు అర్హులు. వీరు పశువైద్యమునందు చేసిన కృషి, సేవయు, మంత్రిలు, జిల్లాబోర్డు అధ్యక్షులు, గవర్నమెంటు పశువైద్య ఉద్యోగస్థులు, పెద్దపెద్ద భూస్వాములు మున్నగువారిచేత ప్రశంసింపబడినవి. పశువైద్యమునందు పురాతనపద్ధతు లన్నియు మార్చి ఆధునికపద్ధతులపై వైద్యముచేయు ఇట్టి డాక్టరుగా రుండుట మన మెంతయు గర్వించవలసిన విషయము.

చౌదరిగారి గ్రంథములను, ప్రతిగ్రామ పాఠశాల పుస్తకభాండాగారమునకు, ప్రతిఆయుర్వేద చికిత్సాలయమునకు సప్లయిచేయుటవలన స్థానికసంస్థలుచేయు అమూల్యసేవకు మేరలేదని మదరాసు శాసనసభాధ్యక్షులగు గౌ॥ బి॥ రామచంద్రారెడ్డిగారు వెల్లడించిన అభిప్రాయముతో నేనును పూర్తిగా ఏకీభవింతును. చౌదరిగారి ఉత్కృష్టసేవకై వారి నభినందించుచు వారి సంస్థాభ్యుదయమునకై నేను కోరుచున్నాను.

వి. సత్యనారాయణ,
తహశ్శీల్దారు, గుడివాడ.

---

ఈ చికిత్సాలయము నెంత ప్రోత్సహించిన అంతమేలు. ఆధునిక పద్ధతులతో నడుపబడుచున్నది. అంటువ్యాధుల నివారింపగలశక్తి ఈ చికిత్సాలయమునందు గలదు. ఈసంస్థ జయప్రదముగా సాగుగాక.

శ్రీ రాజారావు,
తహశ్శీల్దారు, గుడివాడ.

---

నేడుదయమున అంగలూరులో నెలకొల్పబడిన అయుర్వేద పశు చికిత్సాలయమును చూడగలిగినందులకు చాల అనందించుచున్నాను. ఈ సంస్థవిషయమై చౌదరిగారు చాల శ్రద్ధవహించుచున్నారు. వీరి పరిశ్రమ ఫలించి యీ సంస్థ మరికొన్నిటికి అదర్శప్రాయమై చిరస్థాయిగా వెలయుచు లోకల్ బోర్డులయొక్కయు, భూస్వాములయొక్కయు సహాయమునకు ప్రథమార్హమై యుండును.

యన్. నరసింహరాజు,
తహశ్శీల్ దారు, గుడివాడ.

---

శ్రీరాములుచౌదరిగారు మూగజీవులకు అయుర్వేద పద్ధతులతో చికిత్స చేయుచున్నందులకు సంతోషించుచున్నాను. కొందరు విద్యార్థులు వారు స్థాపించిన పాఠశాలలో తర్ఫీయదగుచున్నారు. త్వరలో గవర్నమెంటువారు రికగ్నయిజు చేయుట మంచిది.

సి. హెచ్. వెంకటేశం,
డిప్యూటీ యిన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు.

---

రైతులక్షేమమునకై, వారిపాడిపంటలవృద్ధికై వారి గడపలపనిమికై, వారి స్త్రీలహృదయవికాసమునకై యుపయోగపడు ఈ పశువైద్యచింతామణిని తుద కిప్పటికైనను మన చౌదరిగారు ఈ రూపముగా నిచ్చినందులకు సంతసము.

ప్రొఫెసర్, జి. రంగనాయకులు,
బి. లిట్. (అక్సుఫర్డు), యం. యల్. ఎ.

---

శ్రీరాములుచౌదరిగారు అదర్శప్రాయమగు వైద్యశాలను స్థాపించి స్వయముగ నెల్లరకు దగు అనుభవముల విశదపఱచి అంధ్రదేశమున కాదర్శకు డాయె ననుటలో నతిశయోక్తి లేదు.

కల్లూరి చంద్రమౌళి,
బి. యస్, సి. (వ్యవ), బర్డ్స్, యం. యల్. ఏ.

---

శ్రీకృష్ణాజిల్లాబోర్డువారు యీ ఆయుర్వేద పశు చికిత్సాలయ సంస్థకు రు 500-0-0 విరాళమొసంగుట చాలసంతోషమైన విషయము. ఈవిరాళము ప్రతిసంవత్సరము నొసంగబడునని నేను తలంచెదను. గవర్నమెంటువారు యిటువంటి సంస్థలకు యెల్లకాలము కొంత ధనసహాయమును చేయుట చాలసమంజసము. ఈసంస్థ జయప్రదముగా సాగుచుండుగాక.

పి. వి. నారాయణ,
డెలిగేటు ప్రెసిడెంటు, కృష్ణాజిల్లాబోర్డు.

---

రైతాభ్యుదయముకొరకు స్థాపించిన పశుచికిత్సాలయమును గూర్చియు వారినిర్మలత్వమును, నిష్పాక్షికత్వమును గూర్చియు వచించుటకు, గుణగ్రహణము చేయుటకు నెంతయు ఆనందించుచున్నాను. వీరు నడుపుచున్న పశువైద్యశాల కడుశుభ్రముగ నున్నది. మందులకొదువయుండదు. వారి వైద్యశాల రిజష్టరు వారికున్న పలుకుబడిని, ప్రతిదినము వ్యాధినివారణార్థము వచ్చు పశువులసంఖ్యను, స్పష్టముగా సూచించుచున్నది.

వర్ఘూర్ ఆరేషమ్,
జిల్లా ఆరోగ్య శాఖాధికారి.

---

ఆయుర్వేదశాస్త్రపద్ధతిని శ్రీ చౌదరిగారు పశువులకు చేయుచున్న సేవ ప్రశంసనీయము. ప్రభుత్వమువారును స్థానికసంస్థలును సర్వవిధముల సహాయపడి యీఉద్యమమును ప్రోత్సహించుట ఆవసరము. అందుకు ఈచికిత్సాలయము అర్హతపొందినది. సర్వేశ్వరుడున్ను ఆశీర్వదించుగాక.

తుర్లపాటి వెంకటేశ్వరరావు,
బారిష్టర్, జిల్లాబోర్డుమెంబరు.

వి. కనకబాపయ్య,
అడ్వకేటు.

వి. రామకోటయ్య,
బి. ఎ., బి. యల్.

---

## లింగం వీరభద్రయ్యగారు, బి. ఏ. (ఆక్సుఫర్డు) బ్యారిష్టర్.

మనదేశము వ్యవసాయముమీద చాలవర కాధారపడియున్నది. రైతులకు పశువులుమూలము. కొన్ని సంవత్సరములనుండి వ్యవసాయమున కాధారభూతమైన పశువులను తగినట్లుగ పోషించుటయు జరుగుటలేదు. శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు పశువుల సంరక్షణకు తగిన విద్యను సంపాదించి పుస్తకములరూపముననుు తమ వైద్యశాల మూలముననుు రైతులకు సాయపడుచుండుట మిక్కిలి ప్రశంసాపాత్రము. రైతుబిడ్డలగు వీరు రైతునకు ప్రాణాధారమువంటి పశువుల సంరక్షణకు పూనుకొనుట మిక్కిలి సమంజసము. వీరి పరిశ్రమ అభివృద్ధిలోనికి వచ్చుగాక యని ఆశపడుచున్నాను.

---

## యస్. నరసింహారావుపంతులుగారు, డిప్యూటి యిన్స్పెక్టరు, గుడివాడ రేంజి.

నేను శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారి ఆయుర్వేద పశువైద్యశాలను, వారిచే రచియింపబడిన పలు పశువైద్యగ్రంథములను చూచితిని. వీరు అనుభవ వైద్యముచేతనే యింత యున్నతదశకు రాగలిగిరి. వీరు చేయుపని, కృషి, సేవ యెంతయు నుపయోగార్థమైనవి. ప్రశంసార్హము. వీరికృషి నిర్విఘ్నముగా జయప్రదముగా ఫలించుగాకయని నమ్ముచున్నాను.

---

శ్రీ శ్రీ శ్రీ రాజా యం. వి. అప్పారావుబహద్దరు ఉయ్యూరు జమీందారుగారును, శ్రీ శ్రీ శ్రీ రాజా శివరామప్రసాద్ బహద్దర్ చల్లపల్లి జమీందారుగారును, శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ అప్పారావు బహద్దరు గొల్లపల్లి జమీందారుగారును

ఈవిధముగా తెలిపిరి.

మేమున్ను తదితర పెద్దమనుష్యులును కలిసి యీ ఆయుర్వేద పశు చికిత్సాలయ సంస్థను పరిశీలించితిమి. డాక్టరు శ్రీరాములుగారి ప్రయత్న మెంతయు పొగడదగియున్నది. డాక్టరుగారు మిగుల శేముషీ ధురంధరులు. వీరు నిజముగ నీ విషయమునందు జయము పొందుదురని మా యాశయము.

---

యం. నరసింహారావుగారు, కృష్ణాజిల్లాబోర్డు ఎడ్యుకేషనల్ ప్రెసిడెంటు, జిల్లాబోర్డు మెంబరు.

డాక్టరు యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారిచే స్థాపింపబడి పోషింపబడుచున్న పశుచికిత్సాలయమును సందర్శించితిని. ఈ సంస్థతరఫున శ్రీరాములుగారిచే ప్రచురింపబడు గ్రంథములు కృషీవలుల కెంతో యుపయుక్తమైయున్నవి. డాక్టరుగారి సహజమగు బుద్ధికుశలతయును, స్వానుభవమును వారిని మిగుల జనసమ్మతునిగా నొనరించినవి. జిల్లా తాలూకా బోర్డుల సహాయమునను జనాదరణమునను వారి పశుచికిత్సాలయ సంస్థ యభివృద్ధిలోనికి రాగలదు.

---

శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు "అనుభవ పశువైద్య చింతామణి" యను గ్రంథమును రచించి వైద్యవాఙ్మయమునకే కాక ఆంధ్రదేశములోని రయితు సముదాయమున కత్యంతమగు మేలొనగూర్చిరి. కలకాలము ప్రేమపూరితమైన కృతజ్ఞతా పాశములతో రయితువర్గమును గట్టివైచుకొనిరి. అనుభవమువలన సంపాదించిన జ్ఞానమును వారు కొంత కాలముగ వార్తాపత్రికల మూలమునను, ఇంతకుబూర్వమే వెలువడిన కొన్ని గ్రంథముల మూలమునను బ్రచురపరచిరి. పశుచికిత్సయందు వీరి కెంత యభిలాషకలదో, రయితుల కా జ్ఞానమును బోధించుటయను, అంత యుత్సాహము కల దనుటకు ఈ గ్రంథరచనప్రచురణములవలన గల్గిన శాశ్వతోపయోగమే తార్కాణము. గ్రంథముయొక్క ప్రాశస్త్యము, ఉపయోగము పరికించినంతటనే విదితమగును.

అచ్చటచ్చట గ్రామవాసులలో నుండిన పశు చికిత్సకులు పూర్వాచారములవలన గలిగిన మౌఢ్యముచేత స్వకీయానుభవ విజ్ఞానమును లోకమున కుపయుక్తమగురూపమున శాశ్వత మొనర్పక ఆత్మకుటుంబపోషణమే పరమార్థముగా నెంచి, అర్థసంగ్రహణమే విజ్ఞానసంపాదనమునకు పర్యవసానమని తలంచి, తద్విజ్ఞానమును గుప్తపఱచి మరణించుటచే, అనేక చికిత్సకుల యనుభవలాభము భరతఖండమునకు మఱుగైపోయెను. అట్టి యనుభవమును గ్రంథస్థ మొనర్చుటకు వలయు భాషాపరిచయాభావమువలన కొంద ఱజ్ఞానము నిరుపయోగమై శైథిల్యమునుబొందెను.

మన దేశమున పశుగణ మెక్కుడుగా గలదు. రయితులసంఖ్యయు చాల గలదు. ఒక చికిత్సకుని స్వయముగ బోషింపగల పశుగణమును పెంచెడి పెద్దరయితు లెవ్వరును గానరారు. ఒకటి రెండెద్దులను గలిగిన రయితుల సంఖ్యయే యెక్కువగా గలదు. అట్టివారు తమ పశువులకు ధర్మ చికిత్స చేయించుకొన గలవారలేగాని ద్రవ్యమొసంగి వైద్యుని పోషణమునకు దోడ్పడువా రరుదు. విపరీతమైన వెలలకు పశువులను కొనుటకు వాడుకపడినట్లు, కొన్నిరూకలిచ్చి వానికి చికిత్స చేయించుకొనుట కింకను రయితులు చక్కగనలవాటు పడలేదు. అదియును గాక ప్రభుత్వమువారిచే నియమింపబడిన "వెటరనరీ" వైద్యుల సంఖ్య మిక్కిలి కొంచెముగా

నుండుటచే వారి వలన నుపయోగము రయితుల కందరికిని అందుబాటులో లేదు. ఉన్నచోటులందును అట్టి వైద్యమునకు ప్రోత్సాహము కలుగ కున్నది. "వెటరినరీ" వైద్యము కేవలము హైందవపద్ధతికి విరోధమయిన దనియు, అందువలన నిరుపయోగ మయినదనియు ననేకులకు భ్రమ యిం కను గలదు.

ఈ పరిస్థితులను చక్కబఱచుటకు గాబోలు ఆంధ్రరయితు లెక్కు వగా లాభపడుటకో యన శ్రీరాములు చౌదరిగారిని శ్రీరామచంద్రుడీ గ్రంథరచనకు బ్రోత్సాహపరచెను. ఈ గ్రంథము యొక్క యుపయో గము త్వరలో నాంధ్రదేశమునకు అంధ్రరయితునకు వ్యక్తపడుననుట నిస్సందేహము. ఇయ్యది ప్రతి రయితువద్ద మండతగిన్నది. ప్రతి గ్రామపాఠ శాల పుస్తక భాండాగారములోనుండి స్థానికసంఘములు రయితుసంఘము నకు దోడ్పడుట యవసరము. ప్రతి గ్రామోద్యోగి కార్యస్థానమునందు చౌదరిగారి గ్రంథముల నుంచి రయితులు కోరినప్పుడు చదువుకొనుట కను వేర్పరచినచో ప్రభుత్వమువారును రయితుల కృతజ్ఞతకు బాత్రు లయ్యె దరు.

ప్రతి ధర్మాయుర్వేద వైద్యశాలకును స్థానికసంఘము లీ గ్రంథము లను సరఫరాచేయుట యుచితము. చౌదరిగారిప్రయత్నమునకు ఫలము రయితు లందరకు ఈ గ్రంథము అందుబాటులో నుండుటయే. వారి గ్రంథములను గల గ్రామ గ్రంథాలయములు రయితులకు మఱింత యుప యోగకారులుగ నుండగలవు.

శ్రీయుత శ్రీరాములుచౌదరిగారికి ఆయురారోగ్యములను దైవము ప్రసాదించి యింక నిట్టి యనుభవచికిత్స గ్రంథములను రచించుటకు ధీసంప దలను గల్గించి దీవించుగాత.

మదాసు. } బెజవాడ రామచంద్రారెడ్డి, బి. ఏ.,
యక్సుప్రెసిడెంటు, మదాసు లెజిస్లేటివ్ కౌన్సిలరు

---

## శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ జమీందారుగారు, యం. యల్. ఎ., చల్లపల్లిరాజావారు, కృష్ణాజిల్లాబోర్డు ప్రెసిడెంటు.

## పశుసంరక్షణ.

పశుసంతతిని రక్షించుట సాధారణమైన పనిగాదు పసిబిడ్డలవలెనే నోరులేని పశువులకష్టములనుగూడ వేయికండ్లతో విచారించి కాపాడు కొనవలయును. దానిలో ప్రభుత్వమున కెంతయో బాధ్యతకలదు. ప్రభుత్వమువారుగూడ పశువైద్యాలయములను స్థాపించి రైతులకు సాహాయము చేయుచున్నారు. కాని ఆ వైద్యసహాయ్యము చాలక రైతులు పల్లెటూళ్ళలో చేయబడుచున్న రాక్షసవైద్యముతో తృప్తిపడుచున్నారు. ఈ పద్ధతిని మాన్పించి మానవులవలెనే పశువులనుగూడ సక్రమవైద్యమున సంరక్షించుట ప్రభుత్వమునకును, ప్రజలకును ధర్మమై యున్నది.

## శ్రీరాములుచౌదరిగారి కృషి.

ఈ సత్కార్యమునకు శ్రీయుతులు యేజెళ్ల శ్రీరాములు చౌదరి గారు ముందంజ వేయుట మెచ్చుకొనదగియున్నది. పశువైద్యము వంశ పరంపరగా వారికి వచ్చినధనము. వ్యక్తిగతముగా చేయుచున్న వైద్యసాహాయ్యమే గాక ప్రత్యేకముగా నీ వైద్యశాలను స్థాపించి తద్వారా వారు కావించిన సేవ అపారము. ఈచికత్సాలయ ప్రయోజనముల గమనించియే కృష్ణాజిల్లాబోర్డువారు దీనికి కొంతగ్రాంటును మంజూరు చేసి యుండిరి. ఈవైద్యాలయము ప్రారంభింపబడినది మొదలు నేటివరకు జరిపిన సేవను పెక్కురు శాస్త్రవేత్తలు, ప్రభుత్వోద్యోగులు మెచ్చుకొని యున్నారు. ఇచట ఆయుర్వేద చికిత్సయేగాక ఆంగ్లేయవైద్యమును, శస్త్రచికిత్సయు గూడ చేయబడుట గమనింపతగియున్నది. అందువలన రైతులందరు నీవైద్యాలయమును శ్రద్ధగా పోషించుకొనవలయును. మరియును ఇట్టి వైద్యాలయములు ఫిర్కా కొకటిచొప్పున, అధమపక్షము

తాలూకా కొకట్టి టివంతునసైనను స్థాపించుకొని దానివలన తమ పశుగణమును రక్షించుకొనవలయును.

సాహసము మాత్రము సాహాయ్యముగా ప్రారంభింపబడి నేడొక యమోఘ సంస్థగా తయారయిన యీ ఆయుర్వేద పశుచికిత్సాలయము ప్రజాప్రభుత్వముల ఆదరణమును బడసి ఇంతకంటెను మహత్తరముగా రైతుసేవ చేయగలదని ఆశించుచూ విరమించుచున్నాను.

---

శ్రీ యేజెళ్ళ శ్రీరాములుగారు చేయుచున్న పనిని, వారికళాశాలను చూచి అమితానందము పొందిని. ఏవైద్యకళాశాలలోనూ చదువక పెద్దగ్రంథములను చదువుటకు కావలసినంత సామాన్యవిద్యను పాఠశాలలో చదువక స్వయంకృషివలన యింతవిద్యను గడించుట సామాన్యమైన పనిగాదు. విద్యను సంపాదించుటయేగాక దానిని మరలపల్లెలలో విశేష విద్యావంతులుగాని యువకులను చేరదీసి తమవలెనే వారినిగూడ తయారుచేయనెంచుట స్తోత్రార్హమైనపని. అందులోను నోరులేని పశువులకు సేవచేయనెంచుటకంటె వుత్తమమైన కార్యము మరొకటిలేదని నాయుద్దేశము. వారి జీవితమునుండి వారుచేయుచున్న పనినుండి సామాన్యజనులు గుణపాఠమును నేర్చుకొనుటయేగాక ప్రభుత్వముగూడ విద్యావిధానమును తయారు చేయుటలోకూడ వీరినుండి నేర్చుకొనవలసినది చాలయున్నదని నొక్కి చెప్పవచ్చును. ఈశ్వరుడు వారికృషికి సర్వవిధముల తోడ్పడుగాక యని కోరెదను.

తల్లాప్రగడ నరసింహాశర్మ,
ఆనంద నికేతనం, చాగల్లు ఆశ్రమము, ప. గోదావరిజిల్లా.

---

శ్రీయుత యేడెళ్ళ శ్రీరాములుగారిచే నడుపబడుచున్న విద్యాలయమును చూచితిని. వీరీపాఠశాలను నాల్గు సంవత్సరములనుండి నడుపుచుండిరి వీరి విద్యార్థులు పలుతావుల వైద్యాలయముల స్థాపించి ప్రశంశనీయముగ పశుచికిత్సలు చేయుచుండిరి. పశుపోషణనుగూర్చి, వుపన్యాసములతో మాత్రం ప్రొద్దుపుచ్చుచు తగినంతగ పశువైద్యసహాయమును ప్రభుత్వమువారు చేయుటలేదను సంగతులు నిర్వివాదమైనది. అట్టి లోటును పూర్తిచేయుటకు శ్రీ చౌదరిగారు ప్రయత్నించుచున్నందుకు నేను వారిని ప్రశంసించుచున్నాను. యీ విద్యాలయమున శిక్షణము చెందిన విద్యార్థులచే వైద్యాలయముల నేర్పాటుచేసి తగిన ప్రోత్సాహమును చేయ ఆంధ్రులను హెచ్చరించుచున్నాను.

గొట్టిపాటి బ్రహ్మయ్య,
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి.

---

శ్రీయుత యేడెళ్ల శ్రీరాములుగారిచే నడుపబడుచుండిన ఆయుర్వేద వెటరినరీ డిస్పెన్సరీని గాంచి ముదంబందితిని. అనేక పశురోగములను కుదుర్చుచు శ్రీరాములుచౌదరిగారు ఖ్యాతివహించి యుండిరి. వీరు పశువులపాలిట దైవమని చెప్పవచ్చును. వీరు పశువ్యాధులను గూర్చియు, వాటినినివారణ మార్గములను గూర్చియు, పత్రికలకు వ్యాసములు వ్రాయుచు, తద్వారా పశుచికిత్సామార్గములను లోకులకు వెల్లడిచేయుచు దేశోపకారులగుచున్నారు. యీ వైద్యము తమలోనే యంతమొందకుండ దేశమున విరివిగ వ్యాపించులాగున పాఠశాల నొకదానిని సాగించుచు, విద్యార్థులనుగూడ నీ విద్యయందు తయారుచేయుచు, నీ వైద్యమును నలుదెసల వ్యాపింపజేయు తలంపుగలిగి చక్కని కృషి చేయుచున్నారు. పైగా ని వైద్యమును గురించి పెక్కుగ్రంథముల రచించియుండిరి. వీరి యుద్యమములన్నిటికి జయమును గోరుచు, జయమొసంగ భగవంతుని ప్రార్థించుచున్నాను.

కొడాలి శివరామకృష్ణారావు,
ఆంధ్రపత్రిక సహాయ సంపాదకుడు.

---

# ఆయుర్వేద పశువైద్య గ్రంథమాల, అంగలూరు (కృష్ణాజిల్లా).

అయ్యా!

ఈ దిగువచూపించు పశువైద్య గ్రంథములన్నియు నూతన విధానముతో ప్రకటింపబడెను. ఆయుర్వేదపశువైద్య కళాశాల విద్యార్థులకును, ప్రయివేటు పరీక్షలకు హాజరగువారికిని, రైతుసోదరులకు, గ్రామములలో నాటువైద్యము చేయుపశువైద్యులకు, అన్ని గ్రామ పంచాయతీలకు, పుస్తక భాండాగారములకు, కో-ఆపరేటివ్ సొసయిటీలకు, ఆయుర్వేద వైద్యశాలలకు అనుకూలమగునటుల తేలికభాషలో ప్రతిప్రయిమరీ విద్యార్థికి అర్థమగునటుల ప్రకటింపబడెను. ఈ దిగువ గ్రంథములన్నియు ఒకేసారి తెప్పించుకొనువారికి రు 10-0-0 లకే ఈయుబడును.

| | | |
|---|---|---|
| 1 | అనుభవ పశువైద్య చింతామణి ... ... | 1- 8-0 |
| 2 | ద్రవ్యజ్ఞానము ... ... ... | 0-12-0 |
| 3 | ఆంగ్లేయ పశువైద్య వస్తుగుణదీపిక ... ... | 0-12-0 |
| 4 | శస్త్రచికిత్స ... ... ... | 1- 0-0 |
| 5 | అంటువ్యాధులు ... ... ... | 1- 0-0 |
| 6 | నేత్రచికిత్స ... ... ... | 0- 8-0 |
| 7 | ప్రసవతంత్రము ... ... ... | 0-12-0 |
| 8 | వత్సభృత్యము ... ... ... | 0-12-0 |
| 9 | విషతంత్రము ... ... ... | 0- 8-0 |
| 10 | పాడిపరిశ్రమ ... ... ... | 0-12-0 |
| 11 | రాక్షసవైద్యము ... ... ... | 0- 8-0 |
| 12 | పశుజాతులు ... ... ... | 0- 8-0 |
| 13 | పశుగ్రాసము ... ... ... | 0-12-0 |
| 14 | ప్రాచీనపశుసంరక్షణ ... ... ... | 0- 8-0 |
| 15 | పశురోగ విజ్ఞానము ... ... ... | 0- 8-0 |
| 16 | భేషజకల్పము ... ... ... | 0- 8-0 |
| 17 | స్వాస్థ్యవృత్తము ... ... ... | 0- 8-0 |
| 18 | పశుచికిత్సాసారము ... ... ... | 0-12-0 |
| 19 | శారీరశాస్త్రము .. ... ... | 0-12-0 |
| 20 | పశుపరీక్ష ... ... ... | 0- 8-0 |

# ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాల

(రిజష్టర్డు)

కొద్దికాలములో రికగ్నయిజు అగుటకు సిద్ధముగా నున్నది. ఈ సంవత్సరము ఆంధ్రజిల్లాలనుండి 40 మంది విద్యార్థులువచ్చి చదువుచున్నారు. ఇచ్చట తర్ఫీదై వెళ్లినవారికి స్థానికసంస్థలు విరివిగా గ్రాంటులనిచ్చుచున్నవి. కొన్నిజిల్లాబోర్డులు స్టయిపండ్లనిచ్చి మాకళాశాల ట్రియినింగునకు పంపుచున్నారు. ఇంకను ప్రయివేటు పరీక్షలుగలవు. పశువైద్యవిశారద, పశువైద్యప్రవీణ యను పరీక్షలు గలవు. ప్రాథమికోపాధ్యాయులకు, రైతుబిడ్డలకు, నిరుద్యోగులకు మంచిఅవకాశము. విషయములు తెలిసికొనగోరువారు ప్రాస్పెక్టస్‌కు వ్రాయుడు.

కళాశాల ప్రిన్సిపాల్,

అంగలూరు, (కృష్ణాజిల్లా.)



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TP/A/01/B/192 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 123 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, C, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | pravallika |
| పరీక్ష చేసినది | sandhya |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |